## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004429

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారత నీతికథలు

ఉభయభాషాప్రవీణ :

చిన్నము రామయ్యచౌదరి

నిజామియా పబ్లికేషన్సు

హైదరాబాదు



1957

[వెల : రు 0-10-0

# విషయ సూచిక

# 1. శంఖ - లిఖితులు

ఒక యడవిలో శంఖుఁడు లిఖితుఁడు నను నన్న దమ్ములు తపము చేసికొనుచుండిరి. వారున్న తపోవనము రకరకములైన ఫలవృక్షములతో కళకళ లాడుచుండెను. పెద్దవాఁడగు శంఖుఁ డందఱికి పెద్దయై బుద్ధులు గఱపు చుండెను. లిఖితుఁడు తన యన్న కనుసన్నలలో వినయముతో మెలఁగుచుండెను. అన్నకు తమ్మునిపై నంతులేని ప్రేమ. అతని యాజ్ఞ లేక ఆ వనములో ఆ కల్లాడదు.

ఒకనాఁడు శంఖుఁడు లేని సమయమున లిఖితుఁడు ఒక చెట్టునందు ఆరఁబండిన పండ్లను జూచెను. నోరూరి రెండు పండ్లను గోసికొని యింటికిఁ దెచ్చుకొని తినఁబోవు చుండెను. ఆ సమయమునకే శంఖుఁ డింటికి వచ్చెను. తమ్మునిఁ జూచి ''నీకీ పండ్లెక్కడి''వని యడిగెను. లిఖితుఁడు జరిగిన సమాచారము జెప్పెను. ''నేను లేనపుడు చెప్పకుండ పండ్లుకోసికొనుట దొంగతనము కాదా'' యని శంఖుఁ డనెను. ''తొందరపడి తప్పు చేసితిని. తగిన శిక్ష విధింపుఁ''డని భయముతో వినయముతో లిఖితుఁడు పలికెను. ''శిక్ష విధించునది నేను కాదు. రాజుకడకుఁ బోయి నీవు చేసిన తప్పులను చెప్పుము. అతఁడు నీకుఁ దగిన శిక్ష విధించును'' అని శంఖుఁ డాజ్ఞ యిచ్చెను.

అన్న చెప్పినట్లుగా తమ్ముఁ డాదేశము నేలెడి రాజు నొద్దకుఁ బోయి తాను చేసిన తప్పును జెప్పెను. ''చేసినది

దొంగతనము కావున దొంగలకు విధించెడి శిక్ష విధింపు''మని యాతని ప్రార్థించెను.

లిఖితుఁడు చాలా మంచివాఁడు. చేసిన నేరమునకు క్రూరమైన శిక్ష యతఁ డనుభవింప వలసి యుండెను. రాజతనిని పూజనీయుఁడని తలఁచెను. అతఁడు లిఖితునితో "మహాత్మా! మీవంటి పుణ్యాత్ములకు శిక్ష విధించి పాపము మూట గట్టుకొనలేను. చేసిన దోసమునకు శోకించుచుంటిరి. పశ్చాత్తాపముతో మీ పాపము నశించినది. ఇఁక పొం''డని ప్రార్థించెను.

లిఖితుఁడు రాజు చెప్పిన మాటల కొప్పుకొనలేదు. "దోషులను శిక్షించుట రాజధర్మము కావున తనకుఁ దగిన శిక్ష విధింపు''మని రాజును బలవంత పెట్టెను. రాజు చేయునది లేక లిఖితుఁడు చేసిన నేరమునకు కరములు నఱకుటయే తగిన శిక్ష యని నిర్ణయించెను. రాజుగారి ఆనతి చొప్పున రాజభటు లాతని చేతులు నఱికిరి. లిఖితుఁడు చలింపలేదు. బాధ పొందలేదు. రాజశిక్ష ననుభవించి యన్న కడకుఁ బోయి తన మొండిచేతులను జూపెను. తగిన శిక్ష ననుభవించితి నని యానంద మందెను.

శంఖుఁడు తన తమ్ముని సత్ప్రవర్తనకు లోలోపల నుప్పొంగిపోయెను. "తప్పుచేసినందుకు తగినశిక్ష ననుభవించి పుణ్యాత్ముఁడ వైతివి. నీవలన మన కులమంతయు తరించినది. నీవు పోయి బాహుదానదిలో స్నానముచేసి ర''మ్మని తమ్మునిఁ బంపెను.

లిఖితుఁడు నదికిఁబోయి స్నానము చేయుచుండఁగా నతని చేతు లెప్పటివలె మొలచివచ్చెను. అతఁ డానంద ముతో నన్నకడకు పరుగిడిపోయి తన చేతులను జూపెను.

శంఖుఁడు లిఖితుని జూచి "తమ్ముఁడా! దీనికాశ్చర్య పడనేల? నీ పుణ్యబుద్ధికి దేవుఁడు మెచ్చుకొని చేతు లిచ్చి నాఁడు. నీవు పవిత్రుఁడవని లోకమున కర్థమైనది. నీకు శిక్ష విధించిన రాజుకూడ పుణ్యాత్ముఁడై ప్రసిద్ధిపొందినాఁడు. ఎవరి విధులను వారు నెరవేర్చుకొనుటకంటె లోకమందు గొప్ప పుణ్యమేదియు లేదు." అని పలికి, తమ్ముని కౌఁగిలించు కొని యానందించెను. అప్పటినుండి వారి పుణ్యచరిత్రము లోకమున ప్రసిద్ధిపొందెను.

క్రమశిక్షణను పాటించుటకంటె మించిన పుణ్యము మఱొకటి లేదు.

## 2. పూజని - బ్రహ్మదత్తులు

పూర్వము బ్రహ్మదత్తుఁ డను రాజుండెను. అతని యంతిపురములో గోర్వంక యొకటి నివసించుచుండెను. దానిపేరు పూజని. అది కమ్మని గొంతుతో తియ్యని పలుకులతో ముద్దుముద్దుగా సుద్దులు చెప్పుచుండెను. దాని నందఱు నల్లారుముద్దుగాఁ జూచుచుండిరి. అది చాల

రోజులకు పిదప గ్రుడ్లుపెట్టి పొదిగి పిల్లను జేసెను. ఆ రోజుల లోనే రాజుగారి కొడుకొకఁడు పసివాఁడుండెను. గోర్వంక తన పిల్లకుఁ దెచ్చిన పండ్లలో మేలేర్చి యా పిల్లవాని కిచ్చుచుండెను. పండ్లు దినుటకై వచ్చిన బాలుఁడు గోర్వంక పిల్లతో నాడుకొనుచుండెను. పక్కిపిల్లకు ఱెక్కలు వచ్చుచుండెను. బాలుఁడు పెద్దవాఁడగుచుండెను.

ఒకనాఁడు పూజని ఫలములకై పొలములకుఁ బోయెను. అపుడే రాజపుత్రుని బెంచెడి దాదికూడ పనియుండి యెచటికో పోయెను. ఆ సమయమున రాజకుమారుఁడు గోరువంకపిల్లతో నాడుకొనుచుండెను. అది యతనికి దొరకకుండ నెగురుచుండెను. రాజపుత్రునికి కోపమువచ్చి దానిని బట్టుకొని తలఁ బగులఁ గొట్టెను. అది విలవిల తన్నుకొని మరణించెను.

పూజని యెప్పటివలె తన బిడ్డకును రాచబిడ్డకును పండ్లు తెచ్చెను. పిల్లల కిచ్చుటకై లోనికరిగెను. తలపగిలి నెత్తుటిమడుగులో తడిసి మడిసియున్న తనబిడ్డను జూచెను. దాని కడుపు తఱుగుకొనిపోయెను. గుండె లవిసిపోయెను. కన్నీరు మున్నీరుగా విలపించెను. అచటివారివలన రాచబిడ్డ తన బిడ్డను జంపెనని తెలిసికొనెను. రాజసుతుఁడు చేసిన రక్కసి చర్యకు దాని కంతులేని కోపము వచ్చెను.

"నేను దెచ్చినఫలములలో మేలేర్చి రాజసుతునికిచ్చి కన్నబిడ్డకంటె నెక్కువగాఁ జూచుకొంటిని. చేసిన మేలుకు ఫలముగా నాకీ బాలుఁడు కీడొనరించెను. రాచవారు త్రాచుఁబాముల వంటివారు స్వాములతో చెలిమి పాము

లతో చెలగాటమైనది. పగతో మదముతో రాచజాతి పాప జాతిగా బ్రదుకుచుండును. నాకింక వీరితో స్నేహ మీనాటి తోఁ దీఱినది. అన్యాయముగా నా పిల్లను జంపినందుకు ప్రాయశ్చిత్తము చేసెదను'' అని తలపోసి పూజని సమయము కొఱ కెదురు చూచుచుండెను.

ఇంతలో రాజకుమారుఁ డెప్పటివలె మచ్చికతో నచటికి వచ్చెను. పూజని యతని కన్నులకు తిన్నగా నెగిరి కనుగ్రుడ్లు పోవునట్లు గోళ్ళతోఁ జీరెను. ముక్కుతోఁ బొడిచెను. వెంటనే మింటికి రివ్వున నెగిరిపోయెను.

అది ఆకసమున నిలిచి బ్రహ్మదత్తుని బిలిచెను. ''రాజా! నీ బాలుఁడు నా పాపను జంపి పాప మొనర్చినాఁడు. దానికిఁ దగిన ప్రతిఫల మనుభవించినాఁడు. ఇందు నా దోసము వీసమును లేదు. ప్రతిక్రియ మాత్రమే చేసితిని. అందు వలన నాకు పాప మంటదు'' అని పలికెను.

బ్రహ్మదత్తుఁ డామాటలు విని ''పూజనీ! నీ వన్నది నిజము. నీలో లోపము లేదు. నీ విచటినుండి పోవుటకు నా మనసు బాధపడుచున్నది. మన మెప్పటివలె కలసి యుందము. పిల్లవాఁ డతని తప్పునకుఁ దగిన శిక్ష ననుభవించి నాఁడు. అందుకు నేను దిగులొందను. నీ విచట నిలువు''మని నేర్పుతో నోర్పుతో మాటాడెను.

ఆ మాటలు పూజని విని ''రాజా! పరులచే బాధ నొందినవాఁడు పగ దీర్చుకొనుటకే ప్రయత్నించుచుండును. నీకు నే నపకారము చేసితిని. నీ వసలే రాచవాఁడవు. నిన్ను

నమ్మి. నీచెంత నే నెట్లు నివసింతును? నీ వింతమాటలు మాను"మని బదులాడెను.

రాజు దానిపలుకులకు అలుకసెందలేదు. "పూజనీ! చేసినదానికి మాఱుచేసితివి. అంతటితో పగ తీఱినది. మరల మన మెప్పటివలె కలసిమెలసి యుందము. మేలు మఱచి కీడుమాత్రమె గుర్తించుకొనువారు తుచ్ఛులు. నీ చక్కని గుణములు నన్నాకర్షించినవి. అందువలన నిన్నుండుమని యడుగుచుంటి"నని పలికెను.

పూజని రాజుచేయువాదము నాదరింపలేదు. అతనితో "రాజా! నెయ్యము చెడి కయ్యములోఁ బడితిమి. మనస్నేహ మిఁక నదుకుపడదు. తియ్యని మాటల మోసపోయి పగను మఱచి యేమఱియున్నచో చావో కీడో యేదో యొకటి మూడును. ప్రమానిలో నిప్పున్నట్లు మనసులో పగ దాగి యుండును. తలిదండ్రులను, సంతానమును, సోదరులను, మిత్రులను గూడ పూర్తిగా నమ్మియుండరాదని పెద్దలు చెప్పుదురు. ఇఁక మనసులో కసియున్నవారి నెవరు నమ్ము దురు? నీ తేనెమాటలకు నేను మోసపో"నని మిన్నకుండెను.

ఆ పలుకులకు రాజు ఉలికిపడెను. కాని శాంతమును కోలుపోలేదు. మరల నతఁడు పూజనితో "మేలుగీళ్ళు కాలవశమునఁ గలుగుచుండును. మన ప్రయత్నముల వలన నేవియు జరగవు. ఇంత యెఱిఁగిన నేను నీ మే లెట్లు మఱతును? నీవు నన్నెడఁబాసి పోవుట సహింపలే"నని తిన్నని యెలుఁగుతో మన్ననమీఱ మాడలాడెను.

పూజని యాతని మెత్తని పలుకులలోని యలుకను గ్రహించినది. రాజా! సముద్రములో బడబాగ్నివలె నీ చల్లని మాటలలో పగ ఉడికిపోవుచున్నది. ఇంత యెఱిఁగిన నేను నీ చెంత కెట్లువత్తును? ఇఁక నాయాశ విడువు'మని తన యిచ్చవచ్చిన చోటి కెగిరిపోయెను. నిశ్చింతగా జీవించుచుండెను.

తగనివారితో స్నేహము ప్రమాదకరమైనది.

•

# 3. నక్క - పులి

పురిక యను పురములో పౌరికుఁడను రాజుండెను. అతఁడు కోపతాపములతో పాపకర్మము లెన్నియో చేసెను. కొన్నాళ్ళ కతఁడు మరణించి నక్కయై పుట్టెను. అదృష్ట వశమున ఆ నక్కకు పూర్వజన్మ చరిత్ర గుర్తుండెను. తొలి పుట్టువున చేసిన పాపములచే తన కీ నక్కపుట్టుక ప్రాప్తించినదని తెలిసికొని కలఁతనొందెను. హింసచేయుట విసర్జించెను. మాంసము దినుట మానెను. అడవిలో రాలిపడిన పండ్లు పత్రములు ఓగిరముగా నారగించుచుండెను.

దాని వినయము, నియమము తక్కిన నక్కల కెగతాళిగాఁ దోచెను. అవి మాంసమును జూపి దాని కాసపెట్టినవి. తినుమని ప్రోత్సహించినవి. అది వినలేదు. నియమమునుండి

తొలఁగ లేదు. కొలది రోజులలో దాని పేరు వనమంతట మారుమ్రోఁగెను.

ఆ యడవిలో నొక పులి యుండెను. అది అందలి మృగము లన్నిటికి మేటి. నక్క విషయమును తక్కిన మృగములు దానితో చెప్పెను. పులి కుతూహలపడి దానిని బిలిపించెను. నక్క యక్కడకు వచ్చి తనను బిలిపించిన కారణమేమని పులిని వినయముతో నడిగెను.

పులి దానితో "నీవు మంచివాడవని వింటిని. నీ చెలిమికోరి పిలిపించితిని. నన్ను క్రూరుఁడని లోకము వాకొనుచున్నది. నీ చెలిమి నన్నీ నిందనుండి తొలఁచునని తలఁచుచున్నాను. నీ యిచ్చవచ్చినట్లు నన్ను శిక్షించి రక్షించు"మని ప్రార్థించెను.

ఆ మాటలకు నక్క నొచ్చుకొనెను. అది పులితో క్షుద్రజాతిని నన్నింత పెద్దచేయుట తగదు. నీవు మా కేలికవు. నీ యాజ్ఞచొప్పున నడచుకొనుట మా ధర్మము. కాని నాకు సుఖములపై నాసక్తి లేదు. అందుచే నీ వచనములు నాకు రుచింపవు. బాగోగులు నాకు తెలిసినంతవఱకు నీ కెఱిఁగింతును. నీ వద్ద నా పెద్దఱికము చూచి ప్రాఁత సేవకులు రోఁత చెందుదురు. అసూయతో నలమటింతురు. కల్లబొల్లిమాటలు కల్పనచేయుదురు. వానినెల్ల నీ యుల్లమున చేరనీక నన్ను మన్నన చేయవలయును. నా మాట పాటింపవలెను. నా నీతిబోధల ననుసరించి ప్రవర్తింతునని ప్రతినచేయుము. అట్లైన నీ యాన తలదాల్తునని పలికెను.

పులి దానిపలుకుల కియ్యకొని వల్లెయని ప్రతిన సేసెను. నాటనుండి నక్క చక్కని మార్గమున పులిని నడపుకొను చుండెను. దాని మందిరమునకు సమీపమునందే నిలయ మేర్పరచుకొని నివసించు చుండెను. నానాటి కా రెంటికి చెలిమి బలిమి యధికమయ్యెను. మనసులలో, మాటలలో, చేఁతలలో పొఅపు లవి యెఱుఁగవయ్యెను.

కొన్నాళ్ళకు నూతన సేవకుని పెద్దఱికము ప్రాఁత సేవకు లకు వెగటయ్యెను. రాజు తమమీఁద నాదరము చూపుట లేదని క్రోధముతో నవి క్రుళ్ళుచుండెను. "ఆడలేక మద్దెల మీఁద పడినట్లు" వాని కోపము నక్కపై పడెను. దానిని మట్టుపెట్టవలయునని కుట్రలు పన్నసాగెను. పులి నమలెడి పలలములో మేలైనదానిని దాని నిలయమునుండి తొలగించి నవి. నక్కయింటికి గొందివెట్టి యందు చేర్చినవి. మాంస ములో కొంత యంశము లోపించుటను గోమాయువు గమ నించినది. భక్ష్యపదార్థములు రక్షించుటలో నది ప్రమాదము నొందుటలేదు. ఈనాటి కీ పొరపాటు జరిగినది. మాంస మెవరో ముచ్చిలించిరని దాని యూహ. వెంటనే శార్దూల మున కీ సంగతి నెఱిఁగించెను. పులి చోరుల నరయుఁడని తగువారిని నియమించెను.

"కీలెఱిఁగి వాత పెట్టవలె"నని మిగిలిన మృగములు వేచియుండెను. అవి మాంసము వెదకునట్లు నటించినవి. పులిని దీసికొని నక్కయింటికి పోయినవి. దాచియుంచిన మాంసమును జూపినవి.

అవి పులినిజేరి "స్వామీ! నక్క యెక్కడ! వ్రత మెక్కడ! తాను మాంసము తినదఁట! ఆకులతో అలము లతో పొట్టపోసికొనునట! ఇట్టి వింత లెందైన వింటిమా! కంటిమా! ఇది మనలను బేలుపుచ్చినది. మాంస మపహ రించిన యీ నక్క యెంత పాపకర్మమైనను చేయఁగలదు. ఇది నాలిముచ్చు. దీనిశీలము 'పిల్లి శీలము', జపము 'కొంగ జపము'. కపటధర్మ మవలంబించినది. దీనిని నమ్మరా"దని ఉన్నవి లేనివి కల్పించి దాని మనసు పెఱుఁగునట్లు చెప్పినవి.

పులికి అలవికాని కోపమువచ్చెను. తనకు ద్రోహము చేసిన మాయావి యగు గోమాయువును అప్పుడే పట్టి చంపుఁడని ఆజ్ఞ యిచ్చెను.

ఆ పులి కొక ముసలితల్లి కలదు. అది నక్క శీలము చక్కనిదని యెఱుఁగును. మృగములుచేసిన మోసము నది గుర్తించెను. వెంటనే కొడుకునుబిలిచి "నాయనా! తొందర పడి మందమతివై హితుని మృతుని చేయఁ దలఁచితివి. ఆ నక్క యిక్కడకు వచ్చినది మొదలు మన కొనర్చిన హితములు మఱచితివా? సేవకు లసూయతో మాయలు పన్ని యేలికను బేలుపుత్తురు. నీ వన్ని విషయములను గమనింపవలయును. సజ్జనుని యెడల దుర్జనులు, అధికుని యెడల హీనులు, రూపసియెడల కురూపులు అసూయ పడుదురు. ఒక్కొకసారి మంచి చెడుగా, చెడు మంచిగా కనఁబట్టుచుండును. వాని నన్నిటిని నిర్మల బుద్ధితో నరసి తెలిసికొనవలెను. ఈ నక్క యందు దోషము లేదు. నీవు దీనియందలి ప్రేమతో తక్కిన మృగముల నాదరింపవైతివి.

అవి యోర్వలేక కపటోపాయముతో మాంసమును నక్క యింటియందు దాచినవి. రాజైనవాఁడు టక్కరులు పెట్టు చిక్కులను గ్రహించి జాగరూకతతో మెలఁగ వలయును. లేనియెడల హానికలుగును. నిరపరాధియగు నక్కను దండించి పాపము గట్టుకొన వల''దని మందలించెను.

తల్లి బోధలవలన పులి యుల్లము చల్లనయ్యెను. నక్కను బిలిపించి తన తప్పును మన్నింపుమని వేడుకొనెను. బొటబొట కన్నీరు కార్చెను. తన అవివేకమునకు నొచ్చుకొనెను.

నక్క పులిని జూచి ''రాజా! నేను మొదట నీ కొలువున కేఁగొనునపుడే భృత్యుల మాటలు విని నా కెగ్గు సేయవలదని మనవి చేసికొంటిని. నీవును వల్లెయని శపథము చేసితివి. నన్ను గొప్పవాఁడని కొనియాడితివి. ఇపుడు చంపింప నెంచితివి. నా మానాభిమానములను మంట గల్పితివి. తెలిసియో తెలియకయో యొకని నవమానించి వానినే మరల సమ్మానించుట మంచిదికాదు. మన మనసు లిఁక స్నేహముతో పొసగియుండవు. నన్నిఁక వదలుకొను'' మని యరణ్యమున కరిగెను. అన్నపానములు ముట్టక కొన్నాళ్ళుండి అది పరమపదమున కేగెను.

వివేకములేని రాజును గొలుచుట దుష్కరము.

# 4. మూషిక - మార్జాలములు

ఒక యరణ్యమున మఱ్ఱిచెట్టొకటి యుండెను. అది శాఖోపశాఖలతో పొడవు వెడల్పులు పెరిగి చలువపందిరి వలె నుండెను. దానిక్రింద కలుగులో నొక యెలుక నివసించు చుండెను. దానిపేరు పలితుఁడు. ఆ చెట్టుకొమ్మలపై నొక పిల్లి వసించియుండెను. దానిపేరు రోమశుఁడు. ఆ చెట్టుకు చుట్టుపట్టుల గుబురుపొదలు అల్లిబిల్లిగా నల్లుకొని క్రిక్కిరిసి యుండెను. చిన్న చిన్న మృగములెన్నో వానియందు నివసించుచుండెను. ఒక బోయవాఁ డచటికి నిచ్చలు మునిమాపువేళలవచ్చి వల లొడ్డుచుండును. అగపడ్డ మృగముల జంపుచుండును. రేయి యింటికటిగి తరువాత వచ్చి వలలోపడ్డ మృగములను జంపి తీసికొని పోవుచుండును. వచ్చినంతకు తెగనమ్మి పొట్ట పోసికొనుచుండును.

ఒకనాఁడు చెట్టుపైనున్న పిల్లి మేతకొఱకు తిరుగుచు బోయఁ డొడ్డిన వలలోపడెను. ఎరకై తిరుగుచున్న యెలుక వలలో తగుల్కొనిన పిల్లిని జూచెను. దానివలన తన కాపద లేదని తెలిసికొని నిర్భయముగా నచట తిరుగుచుండెను. ఇంతలో నొక గూబయు, ముంగియు వచ్చి తిండికొఱకచట తిరుగుచుండెను. వాని నెలుక చూచెను. అవి భోక్తలు, తాను భోజ్యము. ఏమి చేయగలదు? దానిపని ముందు నూయి, వెనుక గోయిగా నుండెను. అది అపాయము నుపాయముతో తొలగించుకొనవలె నని యాలోచించెను. మెల్లగా పిల్లికడకు జేరెను. దానితో "అయ్యా! ముంగిని

గూబను జూడగా అంగములు వణకుచున్నవి. నీ యండ నన్నుండనిమ్ము. అవి భయపడి నీచెంతకు రావు. నిరాశతో నవి యరిగిన తరువాత నేను వలచేరులు గొఱికి నిన్ను రక్షింతును'' అని ప్రార్థించెను.

మార్జాలమునకు మూషిక భాషణములు సంతోషము కల్గించెను. అది యెలుకతో ''నీవు నా ప్రాణదాత వయ్యెదవు. తప్పక నిన్ని ముప్పునుండి తప్పింతును. ఉలూక నకులములు నా పొడ గాంచి భయపడును. నీకడకు జేరనేరవు. నిర్భయముగా వచ్చి నాయొడిలో నుండు''మని సాదరముగా నోదార్చెను. ఎలుక భయమువిడిచి పిల్లియొడిలో నొదిగి యుండెను. ఉలూక నకులములు ఎలుకపై నాశ వదలుకొని ఆకలి పోకార్చుకొనుట కింకొక చోటికి పోయినవి. వాని పోక నా యెలుక చూచి ముదమందెను. పిల్లివద్ద సెలవు తీసికొని దాని యురులు గొఱుకు నెపముతో అది యావలికి వచ్చెను. మందమందముగా నురిత్రాళ్ళు గొఱుకుచు కాల యాపన చేయుచుండెను.

అలసటతో మెల్లమెల్లగా ఉరిచేరులు గొఱుకుచున్న యెలుకను జూచి పిల్లియుల్లమల్లాడెను. అది యెలుకతో ''నీ విట్లు జాగుచేయుట తగవగునా? ప్రాణములు కాపాడిన నా యెడల నీవు చూపెడి ప్రేముడి నమ్మదగినదిగా లేదు. కృతఘ్నుఁడవై నాకు ద్రోహము చేయకుము.'' అనిదీనముగా బలికెను.

ఎలుక పిల్లిమాటలకు నొచ్చుకొని ''అయ్యా! నీవు నన్ను రక్షించితివి. నిన్ను నేను పేక్షింపను. ఇపుడే వల

గొంటికిన యెడల నీ వలన నా కపాయము దాపురించును. నీవు ప్రబలుఁడవు; నే నబలుఁడను. నీవు భోక్తవు; నేను భోజ్యమను. ఆపద దాపరించినపుడు ప్రాణరక్షణమునకై మన మిరువురము వెరవుతో సంధిచేసికొంటిమి. మనది నిజమైన మైత్రికాదు. నిన్ను పూర్తిగా నమ్మి నెమ్మితో నుండఁజాలను. బోయఁ డగపడినంతనే చరచర వచ్చి వల కొంటికి వేయుదును. అపుడు నీవు ప్రాణభయముతో ప్రమానిపై కరుగుదువు. నాజోలికిరావు. నేను వేగమే లాగలోని కేగు దును. ఇది ఉభయులకు భయములేని పద్ధతి. అంతవఱకు శాంతించి యుండు'' మని భయభక్తులతో బదులు పలికెను.

అవి రెండు నిట్లు ప్రసంగించుచుండ వేగుజామయ్యెను. అపుడు బోయవాఁడు చేత కత్తిపూని కుక్కలతో కిరాతు లతో వచ్చుచుండెను. పిల్లి వానిజాడను గని భయముతో ''యమదూతవలె కిరాతుఁడు వచ్చినాఁడు. ఇఁక నాకేమి గతి'' యని యెలుకను బలుకరించి ప్రార్థించెను. ఆయెలుక ''భీతినొందకు''మని పలికి చేతనైనంత తొందరలో వలనుగ్గు నూచ చేసెను. పిల్లి ''బ్రదుకు జీవుడా'' యని బిరబిర ప్రమానిపై కరిగెను. ఎలుక బొటియలో దూరెను. వేట కాఁడు వచ్చి వాగుర తెగి నుగ్గునూచ యగుటకు చింతించి వెనుదిరిగి పోయెను. బిడాలము భయమువీడి చెట్టుపై హాయిగా నుండెను. ఎలుక కలుగులో సుఖముగా నుండెను.

కొంతసేపటికి పిల్లి యెలుకను బిలిచి ''మిత్రమా! మనము ప్రాణసఖుల మైతిమి. ఇరువురము కలసిమెలసి

యుండక తొలఁగియుండుట మంచిదికాదు. నాకడజేరి నీవు భయ ముడిపికొంటివి. ఉరులు గొఱికి నన్ను రక్షించితివి. నా చుట్టములందఱు నీ చుట్టును జేరి సేవింతురు. నా పెంపు సంపదలను జూచి నీవును, నీ సాయమువలన నేనును సుఖింప వచ్చును ర''మ్మని గారవమువిూఱఁ బలికెను.

పిల్లి మాటలలోని కపటమును ఎలుక గ్రహించినది. అది కలుగులోనుండి వెలికి రాలేదు. అందుండియే పిల్లితో ''అయ్యా! నీ వచనములు సముచితములైనవి. ఐనను శత్రు లెవరో మిత్రులెవరో గుర్తెఱుఁగుట కష్టము. కొందఱు శత్రు వులుగా నుండి మిత్రభావమున మేలు చేయుదురు. మఱి కొందఱు మిత్రులవలె గన్పించి శత్రుభావమున కీడు సేయు దురు. నీవు బలవంతుఁడవైన శత్రువవు. ఒక్కొక్కసారి బలవంతులైన విరోధులు ప్రయోజనము నాశించి లోఁబడి పనులు సాధించుకొందురు. పనియైనయనంతరము బాధింతురు. పామును పట్టునపుడు పాములవాఁడు సైతము తన చేతిని పాము నోరికి దూరముగా నుంచి జాగరూకుఁడై యుండును. నీవు నన్ను అన్నముగా నారగింతువు. నీదరి జేరక పొరుగున నుండి వలసినపుడు మేలు చేయుదును. నమ్మి నీ వద్ద నున్నచో నీ బంధువర్గము నన్నాదరించునా? వారి మనసు రుచి నాశించినపుడు నన్నొక కబళముగా నమలివేయుదురు. ''పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము'' అను మాట పాటింపవలదా? రాత్రి యంతయు బలమైన వలలో జిక్కి పేరాకలితో గ్రుక్కితివి. నీ కిపుడు చలిది కావలసి యున్నది కదా! నన్ను నీ వెందుకు పిలుచుచుంటివో

నే నర్థము చేసికొంటిని. మన స్నేహ మింతటితో కట్టి పెట్టుదము. బలవంతుఁడైన పగతునితో చెలిమి పనికిరాదు. నీవంటివారిని జేరక నేనును, బోయనివంటి వారిని విశ్వ సింపక నీవును జీవింపవలెను. నే నిఁక నిన్ను నమ్మను, పొ'' మ్మనెను.

పిల్లి సిగ్గుపడి యూరకుండెను. ఎలుక వేరొక కలుగు నెలవు చేసికొని సుఖముగా జీవించుచుండెను.

ప్రయోజనము ముగిసిన పిమ్మట పగతునితో స్నేహము పనికిరాదు.

## 5. కపోతము - కిరాతుఁడు

ఒక యడవియందలి బోయపల్లెలో కిరాతుఁ డొక డుండెను. వాఁడు మిక్కిలి పాపాత్ముఁడు. అతఁడు కాంతార మంతయు తిరిగి తిరిగి పక్షులు నెన్నిటినో పట్టుకొనుచుండెను. వానిలో కొన్నిటిని దినుచుండెను. కొన్నిటిని తెగనమ్మి సొమ్ము చేసికొనుచుండెను. వలలు, ఉరులు మొదలగు సాధనములు వానికడ సమృద్ధిగానుండెను. నిచ్చలుపక్షులను జంపి వాఁ డార్జించు పాపమునకు మేర లేకుండెను.

అతఁ డొకనాఁ డడవిలో వేటాడుచుండెను. ఆ సమ యమున వాని పాపములు లెక్కలు గట్టుకొని పరుగెత్తినట్లు

గాలివాన పెనుభూతమై పరుగెత్తుకొని వచ్చెను. వనమంతయు జలమయ మయ్యెను. తడిసి వలిగొని మరణించిన పక్షిగుంపులకు లెక్కలేకుండెను. మృగములు వడవడ వణకుచుండెను. తలలు పొట్టలక్రింద దూర్చుకొని కన్నీరు గార్చుచుండెను. బోయవాఁడు తడిసి ముద్దయై పోయెను. వాని బుజముపై పక్షులను బట్టిన వల వ్రేలాడుచుండెను. అతఁడు నీటివెల్లువను గడచి మెరకనేలకు వచ్చునప్పటికి చీకటి పడెను. ఆ మిట్టపై దట్టముగా నెదిగిన చెట్టు గన్పించెను. దానిక్రింద నొక శిల యుండెను. ఆ శిలపై నతఁడు కూర్చుండెను. చెట్టు వంక చూచి "వృక్షమునందలి భూతములారా! నన్ను రక్షింపుఁ"డని ప్రార్థించెను. అంగములు కొంకరలు వోవుచుండెను. మరణబాధ నొందుచు నతఁ డా శిలపై పరుండెను.

ఆ చెట్టుతొఱ్ఱలో రెండు గువ్వ లుండెను. పెంటిగువ్వ మేతకరిగి చాల తడవయ్యెను. మగగువ్వ దానికొఱ కెదురు చూచుచుండెను. ఎంతసేపటికి రాకుండుటను జూచి "అయ్యో! కష్టసుఖములలో తోడునీడయై మేలుకోరెడి భార్య రాదయ్యెను. ఏమైనదో కదా! మిడిమేలముగా గాలివాన వచ్చినది. వానదెబ్బకు అసురుసురై ఉసురులు వీడదుగదా! ఆమె లేకున్న నేను జీవించి ప్రయోజనమేమి? ఆమె సుగుణములే నాసుఖమునకు కారణములైనవి. ఒకవేళ నామె మరణించినచో నేను జీవించుట సున్న"యని ఆడు గువ్వను దలఁచుకొని వలపోయుచుండెను.

ఆడుగువ్వ బోయవాని వలలోఁబడి జీవించియుండెను. భర్త తననుగూర్చి విలపించుచున్నందుకు చాల చింతించెను.

తన గుణములు మగని మనస్సున కెక్కినందు కానందించెను. వెంటనే తన యునికిని పతి కెఱిగించెను. విధికృతమునకు చింతిపవలదని ధైర్యము చెప్పెను.

ఆమె "బోయవాఁడు మన యింటికి వచ్చి శరణు చొచ్చినాఁడు. శరణాగతుని రక్షించుట పరమపుణ్యము. చలితో వీని యంగములు క్రుంగిపోవుచున్నవి. వీనిచలిబాధ నుడిపి కాపాడు"మని భర్తను ప్రార్థించెను.

కపోతము తన భార్య పలుకులకు సంతసించెను. శరణార్థియైన లుబ్ధకుని గని మనుజభాషణములతో పలుకరించెను. "అన్నా! డస్సితివి. మాయింటి కతిథివైతివి. నీకేమి కావలయునో తెలుపుము" అని వ్యాధుని సాదరముగా నడిగెను.

బోయవాఁడు దాని మాటల కానందపడి "చలిబాధ నన్ను వేదించుచున్నది. శక్తి క్షీణించినది. శరీరము నీరసించినది. దయయుంచి చలిబాధ తొలగింపు"మని దీనముగా ననెను. కపోతము వెంటనే చెంతనున్న బోయపల్లె కేగెను. ఎండు పుల్లలను ముక్కున గఱచుకొని తెచ్చెను. బోయని ముంగల ప్రోవుపెట్టెను. నిప్పుకొఱవి ముక్కున గఱచుకొని తెచ్చి పుల్లప్రోవునం దుంచెను. ఱెక్కలతో "రెపరెప" విసరెను. ఱెక్కల గాలికా నిప్పు "భగభగ" మండెను. ఆ మంటలతో నతఁడు చలికాచుకొనెను. మెల్లమెల్లగా కోలుకొనెను. ఇంతవఱకు నతఁడు చలిబాధవలన ఆకలి బాధ యెఱుఁగకుండెను. చలి వదలగనే ఆకలికి 'నకనక' లాడిపోయెను. గతిలేక కపోతమున కాసంగతి నెఱింగించెను.

కపోత మతని కోరికను దెలిసికొని చాల చింతించెను. అన్నము పెట్టి ఆకలి పోగొట్టుటకు తాను మానవుడు కాదు గదా! తనవద్ద నేమున్నది? ఆకలికి దొరికినది తినుట తమ కలవాటు. కూడబెట్టుట తామెఱుగని పద్ధతి. ఏమి చేయవల యును? అది లెస్సగా నాలోచించినది. బోయవానితో "అన్నా! నా దేహ మాహారముగా నిచ్చెదను. దానిని దిని తృప్తినొందుము" అని పలికెను. తోడనే అచట మండుచున్న మంటకు ప్రదక్షిణము చేసెను. దానిలోఁ బడి మడిసెను.

కపోతము చేఁతలను జూచుచున్న కిరాతుఁడు కంపితుఁ డయ్యెను. ఆశ్చర్యముతో కొంతసేపు కదల మెదల లేకపోయెను. అతని మనసులో నేదో భయము వ్యాపిం చెను. ఆ గువ్వను గూర్చి దుఃఖించెను. "ఇట్టి ధర్మకర్మము లెందైన గలవా?" యని యబ్బురపడెను. తా నొనర్చిన పాపకర్మములకు వలవల యేడ్చెను. వాని మనసు కలవర పడెను. ఆకలిబాధ యేమైనదో కాని పాపములను గూర్చిన తాప మెక్కువయ్యెను. ఆ అనుతాపముతో నతని హృద యము ద్రవించెను. వలలోనున్న పక్షు లన్నిటిని వదలెను. వాఁడు తన మనసులో "ఇది తన యిల్లాలిని, చుట్టపక్కము లను తృణమాత్రముగా వదలినది. అతిథికొఱకు అగ్నిలోఁ బడి ప్రాణములు వదలినది. నాకు గురువై పుణ్యముల నుపదే శించినది. అడవిలో నెడతెగని ప్రయాణము చేసెదను. ఆకలి దప్పులను పోకార్తును. ప్రాణాంతమే నా ప్రయాణమునకు అంతము" అని తలపోసి విరక్తుఁడయ్యెను. తన యిచ్చవచ్చి

నట్లు కాంతారమున సంచరించెను. తుదకు తన నెమరొ్కనిన దావాగ్నిలోఁబడి మరణించెను.

బోయవానికై ప్రాణములు వదలిన పతిని కపోతి చూచెను. కిరాతుఁడు వలలోని పక్షులను వదలగనే అది కూడ నగ్నిలోనఁబడి మరణించెను. ఆ కపోతముల పుణ్య మెట్టిదో కాని వానికొఱకు దేవవిమానము వచ్చెను. ఆ విమానములో నాదంపతులు కూర్చుండి స్వర్గభూమి కేగిరి. అచట దేవతలచే పూజింపఁబడిరి. లోకమున వానిచరిత్ర శాశ్వతమై నిలిచిపోయెను. కవులు వానిని గూర్చి కావ్య ములు వ్రాసిరి.

శరణాగతుని రక్షించుటకంటె మించిన ధర్మములేదు.

## 6. గృధ్ర - జంబుకములు

పూర్వము విదిశాపట్టణము సర్వసంపదలతో పెంపు నొంది యుండెను. అది చదువుల సదనమై అందముల మందిరమై కళకళలాడుచుండెను. నిత్యకళ్యాణము పచ్చతోరణ ముగా ప్రజలు సుఖజీవనము చేయుచుండిరి.

ఆనగరమున ఒకనాడొక బాలుడు మరణించెను. అతడు తలిదండ్రుల కేకైక పుత్రుడు. ఎంతో అందగాడు.

సుతుని మరణమునకు పితరులు పనలి పనలి యేడ్చిరి. చుట్ట పక్కము లెక్కువగా బాధపడిరి. తుద కాపసివానిని శ్మశాన మునకు గొనిపోయిరి. అచట మరల విలపించుచుండిరి. పాతిపెట్టక జాగు చేయుచుండిరి.

అపు డొక గ్రద్ద వారివద్దకు వచ్చెను. వచ్చివారితో "మీ రిచట భీతివిడచి పెద్దగా నేడ్చుట తగదు. అదిగో! ప్రొద్దు గ్రుంకుచున్నది. రాక్షసులు, భూతములు ప్రేతభూమి కరుదెంచు వేళయైనది. వానివలన మీకపాయముకలుగును. పుట్టినవారు గిట్టక తప్పదు. మరణించినవారివెంట జీవించిన వారు పోరుగదా! జననమరణములు ప్రాణులకు సహజ జములు. తెగిపోయినవారు మీరేడ్చినచో తిరిగి వత్తురా? ఇంత తెలిసియు వెఱ్ఱులై యేల విలపింతురు? ఏడుపు మాని యింటికి పొండు. పోనియెడల మీ ప్రాణములకు హాని కలుగును" అని గ్రద్ద శ్రద్ధగా చెప్పెను.

గ్రద్దమాటలకు వారికి వెఱపు కలిగెను. వారందఱు బాలు నచట విడిచి పోవుచుండిరి. అంతలో అక్కడి కొక నక్క వచ్చెను. అది వారితో "గ్రద్ద చెప్పిన వన్నియు అబద్ధములు. దాని మాటలునమ్మి మీరందఱు భీతినందకుడు. అయ్యో! ఈబాలుఁడెంత సుందరుఁడు! చక్కని ముక్కుతో సొగసైన మొగముతో వీ డెంత అందముగా నున్నాడు. వీనిని విడిచిపోవ మీకు కాళ్ళెట్లు వచ్చుచున్నవి? పట్టుకుచ్చు వంటి వెంట్రుకలతో బంగారువంటి దేహముతో కొట్టవచ్చి నట్లున్న వీని విగ్రహము నెట్లు మఱతురు? కన్నులకు వ్రేలాడగట్టినట్లున్న ఈచిన్నవాని యాకారము మాకు

సైతము శోకము గలిగించుచున్నది. కొంత తడ విశ్లే పలవింపుడు. దేవుడు క్రూరుడు కాదుగదా! దయగలిగి వీనిని బ్రదికింపవచ్చును. ఇంకను ప్రొద్దుగ్రుంక లేదు. భయ పడక మీరిచట నిలువుడు. దయామయుడగు దేవుని ప్రార్థించుడు. పని సఫలము కావచ్చును'' అని సాదరముతో బోధ చేసెను.

నక్క మాటలకు వారి కందఱికి ప్రాణము లేచివచ్చి నట్లైనది. ఎంతో ఆసతో బాలుని చుట్టును మూగిరి. శరీరము నిమురుచుండిరి. కురులు గీరుచుండిరి. భగవంతుని ధ్యానించు చుండిరి. బిడ్డయందలి దొడ్డగుణములను తలచి తలచి యేడ్చు చుండిరి. గ్రద్ద వారినిజూచి ''మీరు వెఱ్ఱులవలె నున్నారు. ఈ నక్క టక్కరిది. బుద్ధిలేనిది. శవము వికృతమైనది. కళ తప్పినది. ప్రాణము తిరిగి వచ్చుట కల్లమాట. యముడు చాల క్రూరుడు. మీరెంత యేడ్చినను అతని మనసు కరగదు. బాలునిపై నాస వదలుకొనుడు. అతనికి సుగతి వచ్చుటకై దానధర్మములు చేయుడు. శ్రాద్ధకర్మ లొనరింపుడు'' అని హితోపదేశము చేసెను.

పక్షి యిట్లు చెప్పుచుండగా నక్క దాని మాటలకు అడ్డమువచ్చి ఆక్షేపించెను. అది ఆ జనముతో ''ఈ గద్దవట్టి మొద్దు. దీని మనసు క్రూరమైనది. తన కేదో తెలిసినట్లు నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నది. దయమాలి బాలుని విడిచి పోకుడు. ఎప్పటి కేమి జరుగునో యెవ్వ రెఱుగుదురు! బాలుడు బ్రదుకుటకై ప్రార్థింపుడు. ప్రయత్నము ఫలించి నచో అందఱము సంతోషించుదము. విఫలమైన నపుడే

పోవచ్చును. ఇపుడు త్వరపడి ఇంటి కరుగనేల? చేతనైనపని చేసి తరువాతనే పోవచ్చును.'' అని ఓదార్చుచు పలికెను.

నక్క మాటలు గ్రద్ద కాశ్చర్యము కలిగించెను. గ్రద్ద వారితో ''నక్క మాటలు విని జాగుసేయుట పొరపాటు. నేను పుట్టి బుద్ధియెఱిగినది మొదలు ఇంతవఱకు ఇట్టివింత లెన్నడును వినలేదు; కనలేదు. నాకు దాదాపు పదుమూడు వందల యేండ్ల వయస్సున్నది. ఇంతకాలమునుండి మరణించి జీవించిన పిల్లలనుగాని, పెద్దలనుగాని జూచి యెఱుగను. యువకులనుగాని, ప్రౌఢులనుగాని కని యెఱుగను. ఒక్క విషయము మాత్రము నిజము. చనిపోయిన వారింకొక గర్భమున జనింతురు. వేఱొక రూపము ధరింతురు. తిరిగి ధరణిపై తిరుగుదురు. మనము వారిని గుర్తింపజాలము. వారు మనను స్మరింపజాలరు. ఈ నక్క తెలివితక్కువది. కపట బుద్ధితో మిమ్ములను మోసగించుచున్నది. మీను గేమిటి? జీవించు టేమిటి? ఎవరైన విన్నచో నవ్విపోదురు. పుత్రశోకమువలన మీ వివేకము చాలవఱకు నశించిపోయి నది. ఉన్న మతిని నక్క పోగొట్టుచున్నది. అజ్ఞానులై మీరిచట మసలవలదు'' అని బుద్ధులు గఱపుచు పలికెను.

ఆ మాటలకు వారికి దుఃఖ మెక్కువయ్యెను. నిరాశ జనించెను. బిడ్డను విడిచిపోవ నుద్యుక్తులైరి. నక్క వారి నడ్డగించినది. చక్కని మాటలు చెప్పదొడగినది.

''పక్కి మాటలునమ్మి చిక్కులలోపడకుడు. మరణించి జీవించినవా రనేకులు గలరు. కరుణాసాగరు డగు రఘు

రాముడు మరణించిన భూసురకుమారుని రక్షింపలేదా? ఆ కథ మీరు వినలేదా? సృంజయుని కొడుకగు సువర్ణష్ఠీవిని నారదుడు తన ప్రభావముచే బ్రదికింపలేదా! ఇట్టి ఘటన లెన్నియో కలవు. ఈ గ్రద్ద వట్టి అక్కుపక్షి. ఇది లోకపు సంగతులు ఏమి యెఱుగును? పరమేశ్వరుడు కరుణా సాగరుడు. ఆత డంతటను వ్యాపించి యుండును. మీ యేడ్పు నాలకించునేమో? ఏ అమరుడో సిద్ధుడో మీ అదృష్టమున వచ్చునేమో? వచ్చి పిల్లవాని యసువులిచ్చి కాపాడు నేమో? అట్లైన అందఱికి సంతోషము గదా! ఏల వృథాగా మరలి పోయెదరు?" అని జాలిగదుర పలికెను.

వారు నక్కమాటలు విని తిరిగివచ్చిరి. శవము చుట్టును జేరి కూర్చుండిరి. పిల్లవాని బేరొక్కని పెల్లుగా నేడ్చిరి. దయజూడుమని దేవుని ప్రార్థించిరి. ఇంతలో ప్రొద్దు గ్రుంకెను.

ఆ గృధ్ర జంబుకములు ఆకలిచే బాధపడుచుండెను. బాలుని దేహము నాహారము గొనుటకై యెన్ని నీతులో కల్పనలు చేసినవి. నోటికి వచ్చినట్లు పలికినవి. ప్రొద్దుగ్రుంకిన గ్రద్ద యుండదు. చీకటి పడకుండనే బాలుని మాంసమును దినవలెనని దాని యూహ. పొట్ట నింపుకొనుటకై వారిని పొమ్మని హెచ్చరించినది. తన వాదమును సమర్థించుకొనుట కది నేర్చిన నీతులన్నియు నేకరువు పెట్టినది. చీకటిపడుట నక్క కనుకూలము. అది పగటిపూట తిరుగుటకు భయ పడును, రాత్రియైనచో గ్రద్ద యుండదు, తా నొంటరి

పాటున మెత్తని మాంసమును మత్తుగ దినవచ్చును. ఆకారణముచే ప్రొద్దుగ్రుంకువఱకు వచ్చిన ప్రజలను నిలిపి యుంచుట కది యత్నించినది. గ్రద్దవాదమును ఖండించు టకై పురాణగాథలను త్రవ్వితెచ్చినది. ఏవేవో బూటక ములు మాటాడినది.

ఇట్లవి రెండును తమ ఆకలి నణచుకొనుటకై వాదోప వాదములు సాగించినవి. ఇక బాలకుని బంధువులు దుఃఖ పరవశులై మతిచెడి యుండిరి. వారికి వీని కపటతంత్రము లర్థము కాలేదు. తమపై ప్రేమచేతను బాలుని యందలి జాలిచేతను అవి యట్లు మాటాడుచున్నవని వా రర్థము చేసికొనిరి. నక్కమాటలవైపుకే వారి మనసు మ్రొగ్గినది. తుదకు ప్రొద్దు గ్రుంకినది. కటికచీకటులు నలుదెసల పొటమ రించినవి. చీమ చిటుకమన్న మనసు కళుకుమనుచుండెను.

ఆ సమయమున శ్మశానభూమిలో విహరించుటకై శంకరుడు వేంచెను. అతడు దయామయుడు. దీనులకు దిక్కు. మ్రొక్కినవారికి చిక్కులుండవు. జాలిగుండెతో నతడు చూపెడి దయకు హద్దు లుండవు. ఆపద్బాంధవుడు తలపై నెలవంకతో, మొలపై పులితోలుతో ఆ దేవుడొక వింతశోభతో వెలుగుచుండెను. కపాలమాలలు ముత్యాల పేరులై మెఱయుచుండెను. పాము లాస్వామికి సొమ్ములుగా నుండెను. ఆలగోడు బాలగోడుగా నేడ్చుచున్న వారి మొఱ నాతడు వినెను. వెంటనే వారికి ప్రత్యక్షమయ్యెను. అతని చల్లని చూపులలో కరుణారసము జాలువారు చుండెను.

పలుకులలో నమ్రత మొలుకుచుండెను. వరములు కోరుకొనుడని వారిని హెచ్చరించెను.

పాపహరుడైన హరుని కన్నులార గాంచి వారు పొందిన యానందమునకు మితిలేదు, అతని పాదములపైబడి వారందఱు సాష్టాంగ నమస్కారములు చేసిరి. వేనవేలుగా స్తుతులు చేసిరి. "దేవా! మా మొరలాలించి ప్రత్యక్షమైతివి. నీ సన్నిధానములో మా కన్ని చిక్కులు తొలగినవి. మా మనోరోగములు నీదర్శనముతో నశించినవి. నీ దయ వలన అన్నియు మాకున్నవి. ఒండు వరము లొల్లము. బాలుని ప్రాణము లిచ్చి బ్రదికింపుము" అనిప్రార్థించిరి. పాదములనుండి లేచిరి.

వారి మొఱలకు శంకరుని హృదయము కరగినది. కరుణించి బాలుని ప్రాణముల నిచ్చెను. ఇచ్చి "వీడు నూరేండ్లు బ్రదుకు"నని దీవించెను. ఆకలితో నంగలార్చుచున్న పక్కిని నక్కను జూచెను. "కూటికొఱకు కోటివిద్య" లన్నట్లు అవి చేసిన కపటవాదములను దేవుడు మన్నించెను. వాని కాకలి దప్పులు లేనట్లు వరములు ప్రసాదించెను. ఇట్లందఱి కోఱికల నీడేర్చి దేవదేవు డంతర్హితు డయ్యెను.

ఆ మనుజుల యంతరంగములు సంతసముతో నుప్పొంగిపోయెను. సజీవుడైన బాలుని జూచిరి, కౌగిలించుకొనిరి. మరల మరల నతనివంక నానందముతో జూచిరి. అది యంతయు వారికొక కలవలె గన్పించెను. వారా బాలునెత్తికొని యింటికరిగి, దేవదేవుని స్తుతించుచు సుఖముగాజీవించిరి.

గృధ్ర జంబుకములు ఆకలి దప్పులులేక హాయిగా నుండెను. ప్రమోదముతో నెమ్మదిగా జీవితము వెళ్ళబుచ్చు చుండెను. ఈశ్వరుని ధ్యానించుచు తుద కవి ముక్తిచెందెను.

ఆశ్రితుల మొఱలు వినుట ప్రభువుల కర్తవ్యమనియు, స్వార్థపరులను నేర్పరులు కపటపు మాటల మర్మములు తెలిసికొని మెలగవలె ననియు ఈ కథయందలి నీతి.

## 7. గౌతమ - నాడీజంఘులు

పూర్వ మొక గ్రామమున ఒక బ్రాహ్మణుండుండెను. వాని పేరు గౌతముడు. అతడు చెడునడతలలో గడిదేఱెను. బోయత నొక తెను పెండ్లాడెను. కులములో వన్నె తక్కువవాడయ్యెను. ఆటవికులతో వేట కరిగి జంతువులను జంపుచుండెను. మాంసమును దినుచుండెను. భోగపరుడై రొక్కమునకు కక్కుఱితి పడుచుండెను. నత డొనర్పని పాపకృత్యములు లేకుండెను. నిచ్చలు డబ్బు సంపాదించుటకు తెరువు లరయుచుండెను.

ఒకనాడు వర్తకులు కొందఱు వ్యాపారమునకై దేశాంతర మరుగుచుండిరి. గౌతముడు మంచిమాటలతో వారితో చెలిమి చేసెను. మనసు కలిపెను. వారివెంట బయలు దేఱెను. అంచె లంచెలుగా మంచి దారిలో ప్రయాణము సాగుచుండెను. కొన్నిరోజులు జరిగెను. తరువాత నొక

కాంతారము అడ్డము వచ్చెను. ఆ యడవిలో నందఱు జాగరూకులై ప్రయాణము సాగించుచుండిరి. అది దట్టమైన పొదలతో క్రిక్కిరిసి యుండెను. పట్టపగలే భయము గొల్పుచుండెను. కొంతదూరము పోవుసరికి ప్రొద్దు గ్రుంకెను. వారందఱు భయముచెందిరి. ఒకచోట విడిదిచేసిరి. అరచేతిలో ప్రాణములు పెట్టుకొని కలవర పడుచుండిరి.

పుండున్న చోటనే పుల్ల తగులుచుండును; భయమున్న చోటనే మృత్యువు తాండవించుచుండును. వెఱపుతో సగము చచ్చియున్న వారిపై నొక అడవి యేనుగు వచ్చెను. చిక్కినవారిని చిక్కినట్లు నేలబట్టి కాల జమరెను. ఆసాతు భీతితో నలువైపులకు పరుగెత్తి పోయెను. ఆయువున్నవా రెట్లో తప్పించుకొని బ్రదికి బయటపడిరి. గౌతముడు 'బ్రదుకు జీవుడా' యని పొదలమాటున పాఱిపో సాగెను. అతనికి అలసట బలిసెను. వెంట్రుక లూడెను. ఊడుచున్న బట్టముడిని చేత బట్టుకొనెను. వెనుదిరిగి చూడక చాల దూరము పరుగిడి పోయెను. అప్పటికి చాల ప్రొద్దెక్కెను. ఏనుగు వలని భీతి తొలగెను. హృదయము కుదురుకొనెను. గుండెదడ తగ్గిపోయెను. అదృష్టవశమున యెదుట నొక మఱ్ఱిచెట్టు కన్పించెను. దానికి అల్లిబిల్లిగా గుబురుపొదలు అల్లుకొని యుండెను. ఆ పొద పొడవుగా పఱపుగా చూడ సొంపుగా నుండెను. అందతడు కొంతతడవు విశ్రమించెను. కమ్మని వాసనల వెదజల్లుచు చల్లగాలి యతని సేదదీర్చెను.

ఆ చెట్టుపై నొక గొప్ప కొంగ యుండెను. అది మెచటికో మేతకు బోయి అపుడే వచ్చెను. దాని పేరు

నాడీజంఘుడు. మనసు మంచిది. బుద్ధి చులుకైనది. ఎన్నో నీతు లది యెఱుగును. అతిథిపూజయందు దాని కెంతో ఆదరము. బ్రహ్మదేవుడు దానిని "రమ్మ, పొమ్మ" అని ఆదరించుచుండెను. ఇంద్రుడు దానితో నెయ్యము నెఱపెను. రాజధర్మము లన్నియు అది ఉగ్గుపాలతో నేర్చెను. మిత్రులు దానిని రాజధర్మడని పిలుతురు. అది తన నివాసమునకు వచ్చి విశ్రమించిన బ్రాహ్మణుని జూచెను. వెంటనే దాని హృదయములో వానిపై ఆదరము జనించెను.

"అయ్యా! నీ వెవ్వడవు? ఏమిపనికై యెటు పోవుచుంటివి? ఇట కేల వచ్చితివి? చూచుటకు భూసురుడవుగా నున్నావు. నా కతిథి వైతివి. నీవృత్తాంతమును వివరింపుము." అని కొంగ యెంతో సంతోషముతో నతనిని పలుకరించెను.

పాపము! బాపనికి ప్రాణములు తిరిగివచ్చినట్లయ్యెను. ఎడారిలో నీటిమడుగువలె అడవిలో అతిథిపూజ లభించినది. కావలసినదేమి? కష్టముల తరువాతవచ్చెడి సుఖము లెంతో ఆనందమిచ్చును. అతడు అడవి యేనుగతో ఇడుములు పడియుండెను. ఆ కష్టములు తొలగిన యనంతరము ప్రాణబంధువువలె బకము సత్కరించెను. అతనికి కొండ యెక్కినట్లయ్యెను.

కొంగతో "అయ్యా! నేను మధ్యదేశీయుడను. పేరు గౌతముడు. నా తండ్రి మంచి చరిత్ర కలవాడు. ఆచారపరుడు. అతనికి సుతుడనై కులమునకు కళంకము తెచ్చితిని. సోమరినై వేదములుచదువనైతిని. శ్రౌతకర్మలుసలుపనైతిని.

బోయతను పెండ్లాడితిని. కులభ్రష్టుడనైతిని. వేటలాడితిని. అపారముగా పాపములు చేసితిని. పేద వడితిని. డబ్బుకై దేవురించుచుంటిని. ఒకనాడు వర్తకులు వ్యాపారమునకై దేశాంతర మేగుచుండిరి. వారి వెంట నేనును బయలు దేఱితిని. అడవిలో ప్రయాణము చేయుచుండగా వనగజ మొకటి మాపైకి వచ్చెను. అది యెందఱినో మ్రందించెను. చెట్టు కొకడు పుట్ట కొకడుగా పాఱిపోయితిమి. అదృష్ట వశమున నేను నీ యిల్లు చేరితిని. నా భాగ్య మిట్లున్నది.'' అని గౌతముడు దీనముగా బలికెను.

అతని దీనస్థితికి బకము విచారించెను. విప్రునితో "అయ్యా! నీవు నాకు నెయ్యుడవైతివి. నీ దారిద్ర్యమును తొలగింతును. ఆర్తిని పోకార్తును. చింతింపకుము. ముందు నా యాతిథ్యమును స్వీకరింపుము.'' అని పలికి దేవనదికి పోయెను. రుచిమంతములైన మంచి చేపల నెంచి తెచ్చెను. చక్కగా పక్వము చేసెను. అడవిలో తియ్యని పండ్ల నేర్చి తెచ్చెను. వెడల్పైన పచ్చియాకులను దెచ్చి అతిథిముందఱ పఱచెను. మంచి మాంసమును నందులో వడ్డించెను. మఱొక ఆకులో పండ్లుంచెను. రుచులను వర్ణించుచు తినుమని ప్రోత్స హించెను. అసలే ఆకలిగొన్న బ్రాహ్మణుడు. రుచికరములైన పదార్థము లెదుట నున్నవి. ఇక చెప్పెడిదేమి? తనివిదీఱ మెసవినాడు. 'తృప్తోస్మి' యన్నాడు. వేయి నోళ్ళతో బకమును స్తుతించినాడు. ధన్యవాదము లర్పించినాడు. భుక్తా యాసముతో నొత్తిగిల గోరినాడు.

ఆ కొంగ అతని కోరికలను దీర్చుటకు వేగిరపడు చుండెను. వెంటనే చెంగటనున్న పూలతీవలపై ప్రాలినది. లేత లేత చిగురాకులు కోసినది. వాసనలీను పూలను త్రుంచినది. వెరవుతో వాని నన్నిటిని తన యురవునకు చేర్చినది. ఒత్తుగా మెత్తనిశయ్య నేర్పఱచినది. అతిథి నందు 'శయనింపు'మని ప్రార్థించినది. అతనితో సముచిత ప్రసంగములు జరిపినది. అప్పటికి చాల రాత్రి యయ్యెను. బ్రాహ్మణుడు చిగురాకు సెజ్జపై సుఖముగా నిద్రించెను.

తూరుపు రేకలు తెల్లవార సాగెను. కొంగ నిద్రనుండి లేచెను. విప్రుని మేల్కొలిపెను. అతనితో "సఖుడా! దారిద్ర్యము చాల చెడ్డది. దానితో జీవితము క్రుంగిపోవును. హృదయము చెదరును. మిత్రులు తొలగుదురు. చుట్టములు ఈసడింతురు. గతిలేక మతి చెడును. మరణము క్షణకాలమే బాధించును. పేదరికము జీవిత మంతయు బాధించును. పాపము! నీ యవస్థ నన్ను కలతపెట్టినది. ఇక నీకు పేదఱికము తొలగినదని యెంచుము. బుద్ధి, మిత్రుడు, వెండి బంగారములు పేదఱికమును పోకార్చునని బృహస్పతి చెప్పెను. ఈనాల్గింటిలో మిత్రుడు ముఖ్యుడు. నీవు బ్రాహ్మణుడవు. నేను కాశ్యప పుత్రుడను. నీతో నాకు మైత్రి యేర్పడినది.. నాసర్వసంపదలకు పాత్రుడవైతివి. నాకు ప్రాణసఖు డొకడు కలడు. అతడు రాక్షసరాజు. పేరు విరూపాక్షుడు. అతని రాజధాని మధువ్రజము. ఇచ్చటికి మూడామడల దూర ముండును. అదిగో! ఆ కానవచ్చు దారివెంట పోయినచో నచటికి చేరవచ్చును. నీవా దారినే వేగముగా

నేగుము. మధువ్రజపురము చేరుము. రాజును దర్శింపుము. అతనితో నేను బంపితినని చెప్పుము. అభిమతమును విన్న వించుకొనుము. అతడెంతో ప్రీతుడగును. వెండిబంగారములు, రత్నములు మొదలగు నమూల్యవస్తువు లిచ్చును. కోరికల నీడేర్చును. సంశయింపకుము. పొ'మ్మని విప్రుని సాగ నంపెను. కొంతవఱకు పోయి దారిచూపి వెనుదిరిగి వచ్చెను.

గౌతముడు బకపతి చూపిన మార్గమున నరిగెను. మధ్యాహ్న మగుసరికి మధువ్రజపురము చేరెను. రాజ దర్శనము చేసికొనెను. రాజు వానిని చూచి "ఏలవచ్చితి" వని యడిగెను. బ్రాహ్మణు డతనితో "నాడీజంఘుడు పంపగా వచ్చితిని. అతనికి ప్రియసఖుడను. విప్రుడను. దరిద్రు డను. ధనార్థినై వచ్చితిని. మీ దర్శనము చేసికొంటిని." అని నిజవిషయమును విన్నవించుకొనెను.

రాక్షసరాజు వానివంక తేఱిపాఱజూచెను. లక్షణము లను గని వాని నధముడని యర్థము చేసికొనెను. "నీ కుల మును, విద్యను, యోగ్యతను వివరింపుము. ఏమియు దాచక నిజము చెప్పుము." అని వాని నడిగెను. గౌతముడు ఏమియు దాచలేదు. ఉన్నదున్నట్లు తన వృత్తాంతమంతయు చెప్పెను.

వాని కథను విని రాజు తొణకలేదు, బెణకలేదు. అనాదరము చూపలేదు. అతడు వానిని జూచి ఊహించిన దంతయు నిజమైనది. "వాడెట్టివాడైన నేమి? తన సఖుడైన మహాబకమునకు మిత్రుడు. ఆ పుణ్యమూర్తి స్నేహమువలన వీడు పవిత్రుడు కావచ్చును. ఆ కారణముచే తానిచ్చు

దానమునకు కూడ పాత్రుడైనాడు. ఇక వానిని గూర్చి తర్కింపరాదు. అపార ధనములిచ్చి తృప్తుని గావింపవలెను.'' అని నిశ్చయించుకొనెను. అతనిని సత్కరించుటకు తగిన వారిని రావించెను. వారివెంట నతనిని బంపెను. మఱునాడు మరల రమ్మని చెప్పెను.

మఱుసటి దినము కార్తిక పూర్ణిమ. ఆనాడు జేడు వేలకొలది విప్రులను బిలిపించెను. తనయింట సంతర్పణ చేయించెను. గౌతముని ప్రత్యేకముగా బిలువనంపెను. అందఱికి పసిడి పళ్ళెరములలో వడ్డన చేయించెను. వారం దఱు మృష్టాన్నములను తుష్టిగా నారగించిరి. భోజనములు పూర్తి యయ్యెను. రాజు ఎవరి పళ్ళెరములను వారినే కొని రమ్మనెను. ఆ పళ్ళెరములనిండ వలయు దక్షిణ లుంచెను. వారి నందఱిని సత్కరించెను. గౌతముడు కూడ తాను గుడిచిన పసిడి పళ్ళెరమును గొనివచ్చెను. రాజు ముందు నిలిచెను. ప్రభువు వాని పళ్ళెరమునిండ కనకరాసు లుంచెను. వాడు మోయగలిగినన్ని రత్నముల నిచ్చెను. గౌరవ పూర్వకముగా నతనివైపు చూచెను. పోయి రమ్మనెను. కరస్పర్శ చేసి సన్మానించెను.

గౌతమున కీ సన్మానము మహాశ్చర్యముగా నుండెను. తానొక క్రొత్తలోకమున నున్నట్లు భావించెను. పూర్వము తనను జూచి అందఱును రోతచెందెడివారు. తొలగిపోయెడి వారు. ఇపుడు మహారాజు స్వయముగా గౌరవించినాడు. కరస్పర్శ చేసినాడు. ఎంత అపూర్వ గౌరవము! తలచు కొనగా అతనికే విపరీతముగా తోచెను. తన యదృష్టమునకు

ఉబ్బిపోయినాడు. రత్నరాసులు మూట గట్టుకొన్నాడు. నెత్తిపై పెట్టుకొన్నాడు. రాజువంక కృతజ్ఞతతో చూచినాడు. సెలవు తీసికొన్నాడు.

గౌతముడు బయలుదేరెను. భుక్తాయాసముతో మార్గమున నడచుచుండెను. ఆశతో తీసికొన్న ధనము బరువుగా నుండెను. ఆ మూట మోయలేక మోయుచుండెను. శ్రమతో వగర్చుచుండెను. మెడపై తలపై మార్చి మార్చి మోయుచుండెను. అవయవములు నొచ్చిపోయెను. వీపును మూపులును క్రుంగిపోయెను. నడచి నడచి యెట్లో తుదకు అడవిలోని మఱ్ఱికడకు జేరెను. పొదలోని కొంగ చెంగటికేగి మూటను బడవైచెను. మెడను నడుమును సాగదీసికొనెను. అటునిటు త్రిప్పుకొనుచు నిలిచెను. ఆయాసమును త్రోసివేసికొనుచు బకమువంక కృతజ్ఞతతో చూచెను.

నూతన మిత్రుడగు గౌతముడు పడిన కష్టమునకు కొంగ నొచ్చుకొనెను. అతనిని తనచెంత కూర్చుండబెట్టుకొనెను. ముచ్చెమటలు క్రమ్ముచున్న వాని మేనిని గాంచెను. తన విశాల పక్షములతో మెల్లగా చల్లగా విసరెను. వాని సేద తీర్చెను. కొంతసేపు విశ్రమింపజేసెను. తరువాత చెంతనున్న సెలయేటిలో వార్చిరమ్మని పంపెను. అతడు తిరిగి వచ్చునంతలో మధురఫలముల నేర్చి తెచ్చెను, తినుమని వానికిచ్చెను. రుచిమంతమైన ఫలరస మెంతో ఆప్యాయనముగా వాడు త్రాగెను. ఆపక్షి వానికి పరిచర్యలు చేయుచు చాలకాలము గడపెను. అప్పటికి రాత్రి జాము ప్రొద్దుపోయెను. అలసి బకపతి వానిచెంత శయనించెను.

బ్రాహ్మణుడు నడిరేయికి మేలుకొనెను. మూట ముల్లెలు గట్టుకొనెను. ప్రయాణమునకు సిద్ధపడెను. కొంగ ఇంకను మేల్కొనలేదు. అది సుఖనిద్ర పోవుచుండెను. గౌతమున కొక యాలోచన తోచెను. "మోయలేని బరువు మోసికొని అత డెంతో దూర మరుగవలసి యుండెను. దారిలో ఆకలియైన అన్న మెక్కడిది? అడవిలో ప్రయాణము గదా! కొంగవంటి పుణ్యాత్మ లెచటనుండి వత్తురు? ఉన్నను ఎట్లు కన్పింతురు? కన్పించినను సత్కరింతురని నమ్మక మేమున్నది? తనకు దారిబత్తెము ఎంతో అవసరము. ఈ కొంగ చాల బ్రొవ్వి యున్నది. దీని మాంస మెంతో మెత్తగా రుచిగా నుండును. నోటిలో కరగిపోవును. దీనిని చంపి మాంస మిగురబెట్టి మూటగట్టుకొన్న యెడల దారిలో ఆకలియైనపుడు తినవచ్చును." అని నిశ్చయించుకొనెను.

పామునకు పాలుపోసి పెంచినను తన చెడుగుణమును విడువదుగదా! దాని విషము వృద్ధిపొందునే కాని తగ్గదు కదా! వెంటనే ఆ పాపాత్ము డొక బడియ దీసికొనెను. రెండు చేతులతో గట్టిగా పట్టుకొనెను. నిశ్చింతగా నమ్మి నిద్రించుచున్న కొంగ తలపై బలముగా మోదెను. మరల మరల మెడమీదను ఒడలిమీదను బాదెను. దాని తల పగిలెను. మెడ విఱిగెను. ఱెక్కలు తునిగెను. కాళ్ళు తునకలయ్యెను. అది పూర్తిగా చచ్చినదని తెలియువఱకు సతము కొట్టుచునే యుండెను. దాని ప్రాణములు పోయెను. వాడు దాని యీకలు పెఱికెను. తోలు నొలిచెను. శరీరము చీల్చెను. ప్రేవులు తీసివేసెను. మంచిమాంసము నేర్చి ఆకు

దొప్పలలో నుంచెను. అప్పటికి వేకువ యయ్యెను. వాడు మూట ముల్లెలను నెత్తిపై పెట్టుకొనెను. మాంసపు దొప్పను చంకకు దగిలించుకొనెను. చర చర ప్రయాణము సాగించెను.

వేగుజామున రాక్షసరాజు మేల్కొనెను. కొంగ యింటివైపునుండి దుర్గంధము వచ్చుచుండెను. తన మిత్రుని కేమి కీడు మూడినదో యని అతడు భయపడుచుండెను. తనవారిని రావించెను. ఆ విషయము వారితో ప్రస్తావించెను. అప్పటికి జాముప్రొద్దెక్కెను. రాజధర్ముడు తనకడకు నిత్యము ప్రొద్దుపొడుపున వచ్చెడివాడు. నేడింకను రాడాయెను. “వచ్చిన అతిథి గుణహీనుడు, నీచుడు. వాడు పాపాత్ముడని చూచినపుడే తెలిసినది. ఆ తులువ నా చెలికాని కేమి యపకారము తలచెనో కదా! నామిత్రు డందఱిని నమ్మును. అతని మనసులో కపటములేదు. అందఱు తనవంటివారే యని తలచును. దైవమా! ఏమి చేయదలచితివి?” అని వగచెను.

రాజధర్ముని చూచిరండని కొందఱు భటులనుబంపెను. వారందఱు వడి వడిగా బకపతి విడిదికి పోయిరి. అతడు యచ్చటను లేడు. వెదకి చూడగా కొంగ డొక్క మాత్రమే కన్పించెను. వారి గుండె లవిసెను. ఆ పుణ్యాత్ముని వా రెఱుగుదురు. అతని మరణమునకు వారెంతో విలపించిరి. కొందఱా బ్రాహ్మణుని యడుగుజాడలవెంబడిపోయిరి. నలు వైపులకు కొందఱుపరుగిడిపోయిరి. కొందఱావార్తను రాజున కెఱింగించుటకై యరిగిరి. రాజు తనప్రాణసఖుని మరణవార్త విని పనవి పనవి యేడ్చెను.

గౌతముని అడుగుజాడల వెంబడి భటులు పరుగిడు చుండిరి. బ్రాహ్మణుడు బరువుతో వంగి నడచుచుండెను. అత డెంత వేగముగా నడువబోయినను కాలు సాగుట లేదు. కొలది కాలముననే రాజభటులకు వాడు దొరికెను. వారు వానిని పెడకేలు గట్టి కొట్టుచు పట్టుకొని వచ్చిరి. తమ ప్రభువు ముందు నిలిపిరి. రాజు వాని మొగము చూడ లేదు. "ఈ కృతఘ్నుని నా కడ కేల తెచ్చితిరి? వీనిని క్రూరముగా హింసించుడు. వలసినచో నమలివేయుడు. చిత్రవధ చేయుడు." అని భటులతో పలికెను.

వారు "ప్రభూ! మాకు మాత్రము మతిలేదా! ఈ పాపకర్ముని శరీరము నెట్లు ముట్టుకొందుము. ఎంత రక్కసులమైనను ఈ కృతఘ్నుని మాంసము ముసవజాలము. వీని నంటుకొనుటచే మాకు పాప మంటుకొనును." అని వినయముగా బదులాడిరి.

రాజు "మీరు వీనిని తినుడు; తినక పొండు. ఏమైనను చేసికొనుడు. నా యెదుట నుంపకుడు. దూరముగా తీసికొని పొండ"ని యానతిచ్చెను. వారు వానిని ఊరి వెలుపలికి బంధించి తీసికొని పోయిరి. వాడి కత్తులతో ఒడలు నెత్తురోలుకునట్లు చీరిరి. ఆకలిగొన్న వేటకుక్కల యెదుటికి నెట్టిరి. నెత్తురు గారుచున్న వాని దేహమును గాంచి ఆ కుక్కలు మీదికి దూకినవి. మూచూచినవి. వెంటనే వెనుకకు తగ్గినవి. ఒక్క కుక్కకూడ వాని దేహమును ముట్టుకొనలేదు. కడుపులు నకనక పడుచున్నను నిలబడి ఊరకుండెను. నోరులేని జంతువులకు గూడ పాపభీతి

యెంతో యున్నది. మంచి చెడ్డల విచక్షణ యున్నది. కృత ఘ్నున కేదియు లేదుకదా! అందువలననే ''కృతఘ్నుని దేహమును కుక్కలుకూడ ముట్టవ''ని వేదములు చెప్పుచున్నవి. వేదముల వాద మిప్పుడు నిదర్శనముగా కన్పించినది కృతఘ్నునికి మించిన నీచుడు ప్రపంచమున లేడుగదా!

అసురపతి పురపుర పొక్కుచు తన మిత్రుని కళేబరమును తెప్పించెను. తక్కిన మిత్రులును తానును గూడి స్వయముగా చితిపేర్చిరి. బెంగతో కొంగకు అగ్ని సంస్కారము గావించిరి. వంతతో కొంతదూరము నడచిరి. ఇంతలో వారి చెంతకు సురపతి యరుదెంచెను. అసురవిభుడు దేవవిభుని జూచి యాశ్చర్యము నందెను. వినయముతో సంభ్రమముతో అతనిని గౌరవించెను. ''మహాత్మా! నా రాజధర్ముని నాకిచ్చి కరణింపు''మని ప్రార్థించెను. కన్నీరు మున్నీరుగా దుఃఖించెను.

దేవేంద్రుడు రాక్షసేంద్రుని ఊరడించెను. ''విరూపాక్షా! నీ మిత్రుడు రాజధర్ముడు చతుర్ముఖునికి సఖుడు. ఆత డితనిని చూచి చాలదినము లైనది, రాజధర్ముడు తనవద్ద కనుదినము రాకపోకలు సేయవలెనని యతని కోరిక. ఒకసారికూడ నితడు పోకపోవుటచే నతని మనసులో కలక పుట్టెను. చూడవలె ననుకోర్కె హెచ్చెను. అందుచే నితని కీగతి సంభవించినది. నీ వితని డొక్కకు అగ్నిసంస్కారము గావించి మేలు చేసితివి. నీవు అగ్ని యిచ్చి వచ్చిన తరువాత నొక చిత్రము జరిగినది. ఆ చితి సమీపమున నొక యావు తన దూడకు పాలు గుడుపుకొనుచుండెను. ఆ దూడ నోటి

నుండి నురుగు జాతెను. అది సుడిగాలికి తూలి సొదపైపడెను. ఆ పవిత్రమైన నురుగుతో నాడీజంఘుడు సంజీవితుడయ్యెను. అత డెప్పటి రూపము ధరించినాడు. నీకడకు వచ్చుచున్నాడు. ఇట్లతడు మరణించుటకు జీవించుటకు బ్రహ్మదేవుని సంకల్పమే కారణము. ఆ మహానుభావుని ప్రభావమే యింత చేసినది. నీ విదియంతయు తలచి చింతపడలుము. సంతసము నొందుము.'' అని బుజ్జగించుచు పలికెను.

దేవేంద్రు డిట్లు చెప్పుచుండగనే నాడీజంఘుడు వచ్చెను. వచ్చి తన మిత్రుల కానందము కల్గించెను. తన కతమున గౌతమునకు గలిగిన వెతలకు చింతించెను. వాని దీనదశను చూడలేకపోయెను. అతనిని ''బంధవిముక్తుని చేయు'' మని ఇంద్రుని ప్రార్థించెను. ఇంద్రుడు దివ్యజ్ఞానముతో నవలోకించెను. నాడీజంఘుని మైత్రివలన గౌతముని పాతకములు పటాపంచ లయ్యెనని యతడు తెలిసికొనెను. గౌతముని కతముననే నాడీజంఘుని దర్శనము బ్రహ్మకు కలిగెను. ఆ కారణముచే బ్రహ్మదేవునికి గౌతమునిపై కృప కలిగెను. ఇక గౌతముని వదలుటలో తప్పు లేదని ఇంద్రుడు తలచెను. వెంటనే రాజధర్ముని కోరికను మన్నించెను. బ్రాహ్మణుని వదలించెను. అతని ధనము నతని కిచ్చిరి. అసురపతి వానిని పొమ్మని యానతిచ్చెను. గౌతము డా ధనమును మోచికొనుచు తిరిగి తిరిగి చూచుచు పోయెను. దేవేంద్రుడు స్వర్గమున కేగెను. దైత్యరాజు సంతుష్టుడై బకమును కౌగిలించుకొనెను. ఆనందబాష్పములు రాల్చెను. పెన్నిధిని గన్న పేదవలె వివశుడై పోయెను. కొంత తడవు

ఒకరి నొకరు పరామర్శించుకొనిరి. తుదకు రాజునొద్ద సెలవు తీసికొని నాడీజంఘుడు నిజగృహమున కేగెను. ఈ వింతనుజూచినవారు ఆశ్చర్యముతో కొయ్యబొమ్మలవలె నిలచిపోయిరి. నాడీజంఘుని పుణ్యచరిత్రమును వేనోళ్ళ గొనియాడిరి,

అన్ని ద్రోహములకంటె మిత్రద్రోహము మహాపాతకము. కృతఘ్నత దానికంటెను పాతకము.

## 8. విశ్వామిత్ర - చండాలురు

పూర్వ మొకప్పుడు పెద్ద కఱవు వచ్చెను. అపుడు త్రేతాయుగము ముగియుచుండెను. ద్వాపరయుగము ప్రవేశించు చుండెను. ఆ సంధికాలములో ఎచ్చటను వానచినుకు పడలేదు. వానకాలమున గూడ వేసవి మంటలు మండు చుండెను పచ్చని పైరులు మలమల మాడిపోయెను. నీటి మడుగులు ఎండిపోయెను. చెఱువులు ఏఱులు ఇగిరిపోయెను. తరువులు లతలు కమరిపోయెను. అడవులు మాడిపోయెను. నేల బీటలు వాఱెను. పశువులు నశించెను. ధనధాన్యములు క్షీణించెను. బలవంతులు బలహీనులను దోచుకొనుచుండిరి. అధర్మము పెరిగిపోయెను. యజ్ఞయాగములు ఆగిపోయెను. దేవపూజలువీగిపోయెను. బ్రాహ్మణులుపాడిదప్పిరి. రాజులు మేరదప్పిరి. ప్రజలు ఆకలితో అలమటించుచుండిరి. డొక్కలు

మాడుచుండెను. ఆకలి మరణములు పెరిగెను. ఆ కఱవు పండ్రెండు సంవత్సరము లుండెను. జీవకోటి మాడుపాళ్ళు నశించెను.

ఆ కష్టకాలములో విశ్వామిత్రు డను ముని యెంతో బాధపడెను. అతడు మొదట రాజర్షి, తరువాత బ్రహ్మర్షి, ఆపైన మహర్షి యయ్యెను. మునిపతియై కులపతియై ఖ్యాతి నార్జించెను. ఆకులతో అలములతో కాలము గడపెను. గాలి, నీరు త్రావి జీవములు నిలుపుకొనెను. అతని మనస్సు దొడ్డది. తపస్సు గొప్పది. దేవత లతనికి వెఱతురు. ప్రజలు వానికి భక్తి సల్పుదురు. లోక మాతని మాటకు జవదాటదు. చక్రవర్తు లతనికి పాదాక్రాంతులు. అంతులేని శక్తి సంపన్నుడు. అంతవాడు కూడ ఆకలికి మాడిపోయెను. నియమములు సడలిపోయెను. ధైర్యము ఎడలిపోయెను. పొట్ట చేత బట్టుకొని తిరిగెను. ఎవ రేది పెట్టుదురా యని యెదురు చూచెను. కొందఱిని అన్న మడిగెను. మఱి కొందఱిని మాంసము యాచించెను. దుంపలకు చేతులు చాపెను. పాపము! అతడు అందని పండ్లకు అఱ్ఱులు చాచెను. వాని కేదియు లభింపలేదు. ఆకలితో నీరసించి పోయెను. శ్రమతో తూలిపోయెను. మెల్లగా అతడొక మాదిగపల్లె చేరెను. ఆ పల్లెనిండ ఎముకల ప్రోవులు పడియుండెను. పందుల డొక్కలు, కుక్కల పుఱ్ఱెలు పాడుకంపు కొట్టుచుండెను. అచటివా రందఱు గొడ్డుగోదలను జంపుచుండిరి. నిత్యము వాని మాంసముతో పొట్ట బోసికొనుచుండిరి. ఏ యింట జూచినను పశుమాంసము వ్రేలాడగట్టబడి యుండెను.

ముని కడుపు నకనక లాడుచుండెను. అచటినుండి అడుగు వేయ లేక పోయెను. తూలి నేలమీద పడెను. ప్రాణములు పోవునట్లుండెను. అతడు "ఈ యాపదనుండి గట్టెక్కవలెను; ఎట్లైనను ప్రాణములు నిలుపుకొనవలెను. ప్రాణరక్షణము పరమ ధర్మము." అని తర్కించుకొనెను.

ఒక చండాలుడపుడే ఒక కుక్కను జంపి తోలొలిచెను. తోలుదీసిన కడిమమును గాలిలో ఆఱబెట్టెను. ముని కెదురుగా అది కన్పించుచుండెను. దానిని దిని జీవములు నిలుపుకొనవలెనని ముని తలచెను. "అది ఊరక రాదు. దొంగతనము చేయవలెను. దొంగప్రొద్దు వఱకు వేచి యుండవలెను. ప్రాణములు నిలుపుకొనుటకు మఱొక తెరువు లేదు. ఇట్టి సమయములలో దొంగతనము చేయుట తప్పుకాదు. అధముని ధనముతో ప్రాణములు నిలుపుకొనుట పరమధర్మమని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇది చండాలుని సొమ్ము. దీని నుపయోగించుకొని జీవింపవలెను." అని ముని నిశ్చయించుకొనెను.

ఊరు మాటు మణగెను. ప్రజలు గాఢనిద్రలో నుండిరి. అర్ధరాత్రి యయ్యెను. ముని మెల్లగా లేచెను. తడబడుచు నడచెను. కుక్క కడిమమును జేరెను. దానిని బట్టుకొని లాగెను. లాగుటలో చిన్న చప్పుడయ్యెను. ఆ చప్పుడువలన చేరువలో నిద్రించుచున్న చండాలుడు మేలుకొనెను. మేలుకని మునితో "నీ వెవ్వడవు? మాంసమును ముచ్చిలించెద వేల? నేను నిద్రపోలేదు. నా దెబ్బ చూడుము.

నీ ప్రాణములు తీయుదును.'' అని లేచి బడియ చేతబట్టుకొని వచ్చుచుండెను.

దురదృష్టవంతుడు ఎందు బోయినను ఆపదలు వెంట వచ్చుచుండును గదా! ముని దీనుడై కుక్కమాంసము నాశించినను లభించునట్లు లేదు. వ్రతము చెడినను ఫలము దక్కలేదు. పైగా చండాలునివలన ప్రాణభయ మేర్పడెను. చాలని రోజులలో త్రాడు గూడ త్రాచుబాామై కఱచును. లేకున్న లోకపూజితుడైన మహాముని యెక్కడ? చండాలు డెక్కడ? ఆ ముని ప్రాణభయముతో గడగడ లాడెను. చండాలు డేమి చేయునో యని భీతి నందెను. తన యెడల ప్రజలకు భక్తి మెండని యత డెఱుగును. ఆపత్సమయములో అవకాశము నుపయోగించుకొనదలచెను. తన పేరు చెప్పినచో చండాలు డూరకుండునని యెంచెను. సగము చచ్చి "నేను విశ్వామిత్రుడను" అని యత డనెను.

ఆ మాటలు ముని నోటినుండి వెలువడినవో లేదో చండాలుడు తొట్రుపాటు పడెను. మునికి కేలుమోడ్చెను. మోకరించెను. కన్నీ రొలుకుచుండగా "మహాత్మా! ఇది యేమి? నీ తలంపేమి? యని విశ్వామిత్రు నడిగెను.

ముని అతనితో "ఆకలి పెల్లున కడుపు కాలుచున్నది. ఒడలు మండుచున్నది: నీరసము హెచ్చినది. మూర్ఛ వచ్చినది. ప్రాణరక్షణ అవసరమైనది. పాపకృత్యమైనను కుక్కమాంసమున కాశించితిని. అడిగిన నీ వేమందువో యని భయపడితిని. ఆపత్కాలమున ద్రుచ్చిమి కూడ

ధర్మమని యెంచితిని. అందును అధముని ధనము నపహరించుట తప్పుగాదని తర్కించుకొంటిని. అగ్ని దేవుడు పరిశుద్ధుడయ్యును, సర్వభక్షణము సేయుటలేదా? దానివలన అతని పవిత్రత లోపించుట లేదుకదా! అట్లే నన్నును భావింపుము. ఆ నిశ్చయముతో ఇట్టి పనికి బూనుకొంటిని.'' అని సామ వచనములు పలికెను.

ఆ మాటలు చండాలుడు విని "మహర్షీ! జంతువు లన్నిటిలో కుక్క నీచమైనది. దీనిని దిని ధర్మహాని కావింప కుడు. ప్రాణహానికంటె ధర్మహాని పాతకమైనది. ఇంకొక వెరవుతో నుసురులు నిలుపుకొనుడు.'' అని వినయముగా బలికెను.

అతని మాటలు విశ్వామిత్రుడు విని ''బ్రహ్మతేజస్సు నాకు ప్రాపై యున్నది. తపస్సు నాకు ధనమై యున్నది. ఈ రెండును అగ్నికంటె ఉజ్వలములైనవి. వీనితో నా పాపములు కాల్చివేయుదును. ముందు జీవములు నిలుపుకొనవలెను. తనువున ప్రాణములు నిలుపుకొనుట పరమధర్మము. బ్రదికి యుండిన శుభములు పడయవచ్చును. ఇంకొక తెరవున ఆహారము దొరకలేదు. పూర్తిగా ఆలోచించియే యీ పనికి బూనుకొంటిని. ఈ సారమేయ మాంసమును తనివిదీఱమెసవనిమ్ము.'' అని చండాలుని కోరెను.

ముని మాటలకు చండాలునికి నవ్వువచ్చినది. ''మహాముని! ఆత్మప్రకాశము కలవాడవు. మహాజ్ఞానివి. ప్రాణములపై తీపివలన అధర్మము చేయదలచితివి. అధముని సొమ్మైన

కాశించితివి. నీ తేజోహానికి నే నోర్వజాలను. నీచపుపని చేయుటకంటె చావుమేలు. నీతి విడుచుట మహాపాతకము.'' అని మునితో ననెను.

వాని మాటలకు విశ్వామిత్రుడు కోపింపలేదు. బాధ పడలేదు. ''ప్రశస్తుడైన అగస్త్యుడు వాతాపి మాంసమును దినలేదా? అతని తేజస్సు తగ్గినదా? తపస్సు పాడైనదా? ఆ మహాత్మునికి దానివలన నేమి లోపము కలిగినది? అతనిని లోకము కొనియాడినది. పూజించినది. తపస్సంపన్నులకు పాపము లంటవు. పెక్కుగుణము లున్నచోట ఒక్కదోష మున్నను అది లెక్కకు రాదు. చందమామ చల్లని వెన్నెల వెదజల్లుచున్నది. అమృతమును స్రవించుచున్నది. ఆ చంద మామలో నల్లని మచ్చ యున్నది. ఆ మచ్చ దాని గొప్ప తనమున కేమిలోపము తెచ్చినది?'' అని చండాలుని ప్రశ్నించెను.

ఆ మాటలకు వాడు మరల నవ్వెను. ''తపోధనా! పరులకు మేలుచేయుట పుణ్యాత్ముల లక్షణము. పరులమేలు కొఱకు పాపములు చేసినను భయములేదు. ఆ కల్మషము వారి నంటదు. మహాత్ముడైన అగస్త్యుడు లోకకంటకుడైన వాతాపిని జంపెను. లోకములకు ఉపకారము చేసెను. అత డా పనిని ప్రజలు కోరుటవలన చేసెను. అతనికి మాంసము దొరకక కాదు. అతడు తినదలచిన రక్కసుని మాంసమే తినవలెనా? రుచికరములైన మాంసము లెన్ని లేవు. తన కిష్టము లేకున్నను ప్రజల కష్టములు బాపుటకై అత డా పనిని చేసెను. ఆ మునితో మీకు సామ్యమెక్కడ?

చంద్రుడు లోకము కొఱకు చల్లని వెన్నెల నిచ్చుచున్నాడు. పైరులను పెంచుటకు అమృతమును కురియుచున్నాడు. ఆ పవిత్రమూర్తిలోని మచ్చ యెవరి కపకారము చేయుచున్నది? దానివలన అతని అందమున కేమి లోటు కల్గినది? అది లెక్కలోనిది కాదు. నీవు యశోమూర్తివి. తపోధనుడవు. కుక్కమాంస మెవరి మేలు కోరి తినుచున్నావు? లోకము కొఱకు కాదుగదా? ఈ పాపము నీకు గాక లోకమున కంటునా? అని మునిని ఎత్తిపొడిచి మాటాడెను.

ముని వాని మాటల సారమును గ్రహించెను. వానితో "నా ఆత్మ ఉజ్జ్వలమైనది. ఉత్తమ సంస్కారము కలది. లోకమునకు మేలు చేయగలది. విద్యలను విరజిమ్మగలది. అజ్ఞానమును మాపుమాపగలది. విజ్ఞానమును వెలిగింపగలది. బ్రహ్మపదార్థమును గుర్తెఱిగినది. సూర్యచంద్రుల వలన కలిగెడి మేలుకంటె నావలన తక్కువ మేలు కలుగదు. నా జీవితమువలన లోకము క్రొత్తచైతన్యము పొందగలదు. నూత్నమార్గముల త్రొక్కగలదు. క్రొత్త సృష్టి చేయగలదు. వేయేల నా ప్రాణములు లోకమునకే జీవములు. అందువలన వాని రక్షణకొఱకు నే నీ పనిని జేయుచున్నాను." అని గట్టిగా మాటాడెను.

ఆ మాటలు విని అంత్యజుడు నొచ్చుకొనెను. మునిని అలయించినందుకు చింతించెను. అతడు మునిపతితో "కులపతీ! నా పలుకులను వేరుగా దలపకుము. మాంసమును విడువజాలక లోభినై యిట్లంటినని కినియకుము. మహాత్ముడవు. నీ తేజస్సునకు, తపస్సునకు హాని కలుగునేమో అని

భయపడితిని. ఆ భయమే నన్నింత వాచాలునిగా జేసినది. నాకు మీపై జాలిపుట్టినది. ఇప్పటి మీ యవస్థ ఎంతటి ప్రాతి గుండెవానికైనను కరుణ పుట్టించును. నామనస్సు పరితపించు చున్నది.'' అనెను.

గాధినందనుడు వాని మాటలు విని '' నీకు కరుణపుట్టిన దనుచున్నావు. నాయందు జాలి గలదేని యీకుక్కనంజుడు నాకిమ్ము. నీవు పుణ్యచరిత్రుడ వయ్యెదవు. నీవు ఇష్టపడి యిచ్చుటవలన నాకు దొంగతనము చేయుట తొలగిపోవును. అబద్ధమాడుట తప్పిపోవును. ఆ దోషములు చేయుటవలన కలిగెడి పాపములు నాకంటవు. సత్యవర్తనముతో చేయు పనులు నీచములైనను పాపములను గలిగింపవు. జాగుచేసి నన్ను బాధింపకుము.'' అని వానిని ప్రార్థించెను.

చండాలుడా మాటలు విని ''అయ్యా! మీరు పుణ్య మూర్తులు. ఆత్మప్రకాశము మీ కన్నులలో వెలిగి పోవు చున్నది. పుణ్యము మీపాదములలో ప్రతిఫలించుచున్నది. మీ దివ్య తేజస్సునకు నమస్కారములు. నీచ మానవునివద్ద దానము పుచ్చుకొనుట వినరానిది; కనరానిది; మనసులో నైనను తలపరానిది. నేనిక యెక్కువ తక్కువలు పలికి మీకు విసుగు కలిగింపను. మీరు తలచినట్లు కానిండు. వలచినట్లు నడచుకొనుడు.'' అని దూరముగా తొలగెను. శునకమాంస మిచ్చెను.

ముని దానిని దిని ప్రాణరక్షణము గావించుకొనెను. చండాలు నాశీర్వదించెను. తపస్సుతో పాపమును బాపుకొన

నెంచెను. హిమాలయమున కేగెను. తరువాత ఇంద్రుడు వర్షములు కురియించెను. విశ్వామిత్రుడు తపస్సిద్ధి నొందెను. లోకమున జ్ఞానబీజములు వెదజల్లెను. సాహితీ సస్యములు పండించెను. విజ్ఞానదీపములు వెలిగించెను. ఆ మహాత్ముని వలన లోకము నూత్నచైతన్యము పొందెను. సుభిక్ష మయ్యెను. అభ్యుదయము నొందెను.

ఆపత్కాలమున ప్రాణరక్షణకై పాపకార్యములు చేయుట దోసము కాదు—అని యిందలి నీతి.

## 9. పర్వత - నారదులు

దేవలోకములో పర్వత నారదులను వారుండిరి. వారు దేవమునులు. పర్వతుడు నారదుని చెల్లెలి కొడుకు. వారు నిత్యము నందనోద్యానములో దిరుగుచుందురు. దేవనది యొడ్డున విహరింతురు. కల్పవృక్షముల నీడలో విశ్రమింతురు. బంగారు పద్మములు తిలకింతురు. అమరలోకము ఆనందనిలయము. అచట సుఖముల కేమికొదవ! ఆ మునుల మనస్సులు నిత్యసుఖములతో విసిగిపోయెను. కష్టము లేని వట్టి సుఖమునకు విలువ లేదుగదా! కొంతకాలము ఆ లోకమును వారు వదలదలచిరి. ఎటకైనను పోదలచిరి.

వారొకప్పుడు భూలోకమును జూడవలె ననుకొనిరి. ప్రభావ సంపన్నులకు సాధ్యముకాని దేమున్నది? దివినుండి

భువికి వచ్చిరి. వచ్చుచు "ఒకరికి తెలియకుండ నొకరేమియు చేయరాదు. మనసులోని తలపులను దాచుకొనరాదు." అని గట్టి శపథము చేసికొనిరి. ఆ నియమమును దాటినవారు శాపార్హు లగుదురని నిర్ణయించుకొనిరి. కలసి మెలసి భూలోకమున సంచరించుచుండిరి. వారు శాపము లిత్తురు. అనుగ్రహింతురు. తప్పు చేయుగలరు. సవరించుకొనగలరు. ఇద్దఱు జాలిగుండె కలవారు. ఉపకారము చేయుట వారి కలవాటు. ఎవరికిని కీడు చేయుట యెఱుగరు.

భూలోకము వారిని పూజించినది. రాజులు వారి నాదరించిరి. చక్రవర్తులు వారిని దర్శించిరి. భక్తులు ప్రణమిల్లిరి. మునులు గౌరవించిరి. వారు మెట్టినచోటు పుణ్యతీర్థ మయ్యెను. ప్రజలు వారిని నూఱు చేతులతో పూజించిరి. వేయినోళ్ళతో స్తుతించిరి.

వారొకనాడు సృంజయుడను రాజర్షి యింటి కరిగిరి. అతడు వారిని పరమభక్తితో పూజించెను. ఆతిథ్యమిచ్చెను. చక్కగా సత్కరించెను. అతని సపర్యలకు వారు తృప్తిపడిరి. కొన్నాళ్ళతని యింటనుండగోరిరి. ఆ రాజు ముదమందెను. 'మహాప్రసాద'మని ఉప్పొంగెను. అతని కొక కూతురుగలదు. ఆమె పేరు సుకుమారి. రాజున కామె గారాబుకూతురు. ఎండ కన్నెఱుగని చిన్నది. అందము నామె యందే చూడవలెను. రాజామెను బిలిచెను. దేవమునులను జూపెను. వారిని "దేవోపచారములతో బూజింపు"మని చెప్పెను. మునులతో "ఈ నెలత మీకు సేవ చేయగలదు. మెలకువతో పనులు సలుపగలదు. తృప్తిపఱుపగలదు. సుఖపడుడు" అని పలికెను.

వలసిన వస్తువు లన్నియు నిచ్చెను. చక్కని వసతుల నేర్పఱ చెను. తాను వేయి కన్నులతో వారిని గనిపెట్టి చూచు చుండెను. మునులుకూడ ప్రీతి నొందిరి. సుఖముగా నుండిరి.

ఒకనాడు సుకుమారి మునులకు పరిచర్య చేయు చుండెను. ఆమె సౌందర్యమునకు నారదుడు చలించెను. నాటినుండి అతని జపతపములు మంటలో గలిసెను. వ్రతము బూడిద యయ్యెను. మనసు మార్చుకొన లేకపోయెను. కోరికను కొనసాగించుకొన లేకపోయెను. ధైర్యము సడలి పోయెను. బాధతో క్రుంగి పోవుచుండెను. రోజు రోజుకు కృశించుచుండెను. ముఖము పాలిపోవుచుండెను. తన తలపును పర్వతునితో జెప్పుటకు సిగ్గుపడుచుండెను.

పర్వతుడు నారదుని యాకృతిని పరికించెను. అతని లోని మార్పును గమనించెను. తన మామ వంతనొందుటకు చింతించెను. కారణ మారయ దలచెను. తన దివ్యజ్ఞాన మును బ్రయోగించెను. అతనికి విషయము బోధపడెను. "నారదుడు రాకుమారిని ప్రేమించుటయే తప్పు. ప్రేమించిన వాడు తనతో జెప్పకుండుట మఱింత తప్పు. తాము చేసికొన్న శపథము లెట్టివి? నారదుని ప్రవర్తన యెట్టిది? ఇతడు కుటిలాత్ము డైనాడు. వీని పని పట్టవలయును." అని నిశ్చయించుకొనెను. వెంటనే నారదుని బిలిచెను. "నీవు నియమమును తప్పితివి. రాచకూతును వలచితివి. వలపు పుట్టుట తెలుపవైతివి. మన శపథమును తలప వైతివి. నీ విక సుకుమారిని వరింపక నిలువలేవు. ఆమెను పెండ్లియాడుము. ఆ వెంటనే నీ ముఖము కోతిమొగముగా

మారును. ఇదినాశాపము. అనుభవింపుము" అని కోపముతో పలికెను.

నారదుడు పర్వతుని గర్వమును సైపలేకపోయెను. "తాను కావలెనని తప్పు చేయలేదు. నియమము తప్పలేదు. సిగ్గుతో చెప్పలేక ఊరకుండెను. అంతమాత్రమునకే పర్వతుడలుగవలయునా? శమములేని తప మెందుకు? నిలుకడలేని తెలివి యెందుకు? పర్వతునికి ప్రాయశ్చిత్తము చేయవలెను. లేనియెడల వానిని పట్టపగ్గము లుండవు." అని నిశ్చయించుకొనెను. పర్వతుని జూచి "నీకు నాకలోక గమనము నశించుగాక." అని ప్రతిశాప మిచ్చెను.

పర్వతుడు శపింపబడెను. ఇపుడు వారిరువురికి తవరవలు పెరిగినవి. ఒక చోట నుండుట కిక వీలుపడదు. తన యిచ్చ వచ్చిన చోటికి పర్వతు డరిగెను. ఎందు బోయినను అతడు పూజింపబడుచుండెను. నారదుడు సృంజయుని యింటిలోనే యుండెను. అత డిపుడు కుడితిలోబడ్డ బల్లి యయ్యెను. సుకుమారిని పెండ్లియాడకుండ నుండలేడు. పెండ్లియాడిన కోతిమొగము వచ్చును. ఏమి చేయవలెను? సుకుమారిపై వలపు నాపుకొనలేకపోయెను. తుద కామెను పెండ్లియాడుటకే నిశ్చయించుకొనెను. "ఆమె భార్యయైన చాలును. కోతిమొగము వచ్చినను బాధలే"దనుకొనెను. సృంజయుని వద్ద కేగెను. సుకుమారిని తనకిమ్మని సిగ్గు విడచి కోరెను. రాజు దేవముని కోరికను నిరాకరింపలేదు. ఎంతో సంతోషించెను. తన కూతును మునికిచ్చి పెండ్లిచేసెను. పెండ్లియైనదో

లేదో వెంటనే నారదుడు వానరవదను డయ్యెను. పెద్దల మాటలు తప్పక తగిలి వచ్చును గదా!

నారదుడు కురూపియైనను రాకుమారికి వాని యెడల విరక్తి కలుగ లేదు. భక్తి సడల లేదు. ఉచిత సపర్యలతో పతిని తృప్తి జేయుచుండెను. ఆమె చూపులు వాని పాదముల పైనే వ్రాలుచుండెను. మనసు వాని సుఖమునే కోరును. అతని యానందమే ఆమెకు ముఖ్యము. పతివ్రతయై నిచ్చలు వానిని తనివిదీఱ సేవించుచుండెను.

ఒకనాడు నారదుడు అడవులకు బోయెను. ఆ యడవిలో చిక్కని చెట్లు పసరు గ్రక్కుచుండెను. మెత్తని గరిక గోముగా పెరుగుచుండెను. రకరకముల అడవిపూలు కన్నుల పండువు గావించుచుండెను. వింత వింత పక్షులు ఎగురుచుండెను. వాని కూజితములు చెవుల పండువు సేయుచుండెను. రంగురంగుల మృగములు అటునిటు పరుగెత్తుచుండెను. సూర్యకాంతి చెట్లపై బడెను. బంగారు కాంతులు గ్రక్కుచుండెను. ఆ యడవి అందమునకు నారదుడు మురిసిపోయెను. "తానుండెడి స్వర్గములో ఒకటే అందము. ఆ యందములో మార్పు లేదు. ఎప్పుడు ఆ కల్పవృక్షములే! ఆ హంసలే! క్రొత్త లేదు. వింత లేదు. ఆయడవి యెంత చక్కగా నున్నది! ఎన్ని మార్పులు! ఎన్ని శోభలు! పిచ్చిప్రజలు స్వర్గము మంచిదందురు. అందేమున్నది? ఈ యడవి యందమును చూచి తీఱవలయును. చూచినచో మరల స్వర్గమునకు పోబుద్ధి పుట్టదు." అని తర్కించుకొనుచుండెను. దాని రమణీయకమును మెచ్చుకొనుచుండెను.

ఆనందపరవశుడైన నారదునికి కాలము తెలియలేదు. గడియలు నిమిషములుగా జరిగిపోయెను. చాల సేపటికి వానికి ఇంటి విషయము గుర్తునకు వచ్చెను. "ఇంటివద్ద భార్య తన కొఱకెదురు చూచుచుండెను. తాను వచ్చి చాల తడవైనది. ఇక పోవలయును." అని వెనుదిరిగెను.

ఆశ్చర్యముగా అతని యెదుట పర్వతు డుండెను. అకస్మాత్తుగా అత డచటికి వచ్చెను. నారదునికి అల్లునిరాక ఆశ్చర్యము కలిగించినది. పూర్వము వారిరువురు మనసులు గలిసిన మిత్రులు. మధ్యలో స్పర్ధలు పొడమినవి. తరువాత విడిపోయిరి. విడిపోయికూడ చాల కాలమైనది. నేడు హఠాత్తుగా కలిసికొనిరి. వారి ఆనందమునకు మేర లేకపోయెను. ఎడబాటు తరువాత కలిగెడి కలయికలో ఎంత ఆనంద మున్నది! ఇపుడు వారి మనసులలో స్పర్ధలు లేవు. ప్రేమ జాలువాఱుచున్నది. ఒకరి నొకరు కౌగిలించుకొనిరి. పరామర్శ చేసికొనిరి. సంతోష బాష్పములు రాల్చిరి. కొంతసేపు తన్మయులై నిలచిరి.

పర్వతుని కిపుడు భూలోక సంచారమునందు విసువు జనించెను. నిత్యము సేవించునవి మధురరసములైనను వెగటు పుట్టించునుగదా! దేనిలోనైనను మార్పు లుండవలెను. మార్పులే క్రొత్తరుచులు తెచ్చుచుండెను. అతడు మరల స్వర్గమునకు పోవలెననుకొనెను. కాని మామ యిచ్చిన శాపము అడ్డువచ్చినది. పాపము! అతడేమి చేయును? తాను త్రవ్విన గోతిలో తానే పడెను. తొందరపడి నారదునకు ముందు శాపమిచ్చెను. దాని ఫలము ననుభవించెను.

ఒక్కసారి విషయమంతయు స్మృతికి వచ్చెను. తల గిఱ్ఱున తిరిగిపోయెను. తాను మామ కిచ్చిన శాపమునకు పశ్చాత్తాప పడెను. గ్రుడ్లనిండనీరు గ్రుక్కుకొనెను. "మామా! క్షమింపు" మని నారదుని చేతులు పట్టుకొనెను. నారదు డతనిని బుజ్జగించి ప్రేమతో బలుకరించెను.

మనసులోని బాధలు పశ్చాత్తాపముతో నశించును. దుఃఖానంతరము సుఖములు వచ్చి పైబడును. పర్వతుడు తన కిచ్చిన శాపమును మరల్పు మని నారదుని కోరెను. ఆ మాటలకు నారదుడు నవ్వి "నీవే కదా! ముందు శాప మిచ్చితివి! నాకిచ్చిన శాపమును ముందు మరలించు" మని పర్వతునితో ననెను. పర్వతుడు శాపమును మరల్చెను. నారదుడు కూడ అట్లే చేసెను. అతని కెప్పటి రూపము వచ్చెను. పర్వతునికి ఆకాశయానము వచ్చెను. ఉభయులు నానందించిరి. పర్వతుడు నారదుని వెంట సృంజయుని యింటి కరిగెను. ఇరువురు రాజమందిరమున బ్రవేశించిరి. సుకుమారి యెదురు వచ్చెను. ఆమె భర్త రాలేదు. అతని స్థానమున ఎవరో సుందర పురుషు డున్నాడు. పాపము! ఆమె వారి శాపముల సంగతి యెఱుగదు. నిజపురుషుని పరపురుషునిగా భావించెను. పెడమొగముపెట్టి వెనుదిరిగి పోయెను. ఆమె ఏమి చేయగలదు! పతివ్రతల స్వభావము లట్టివే కదా!

పర్వతు డామె చేతలకు నవ్వెను. ఆమెను బిలిచెను. "అమ్మా! ఇతడు నీపతి. నా శాపమువలన నడుమ నితనికి కోతిమొగము వచ్చినది. ఇప్పు డా శాపము పోయినది. నిజ రూపము వచ్చినది. పోల్చుకొను" మని యతనిని జూపెను.

తమ శాపవృత్తాంతములను జెప్పెను. ఆమెకు నమ్మకము కలిగించెను.

సుకుమారి భర్తను పోల్చుకొన్నది. ఆమె సంతసమునకు మేర లేకపోయెను. ఎప్పటివలె యెదురు వచ్చినది. భర్త పాదములు కడిగినది. ముంచుకొనివచ్చెడి భక్తితో మ్రొక్కినది. ఒడలెల్ల కన్నులు చేసికొని చూచినది. మేనంతయు చేతులు చేసికొని పూజించినది. నారదు డామె సేవలకు తృప్తుడయ్యెను. పర్వత నారదు లచటనే కొంతకాలముండిరి. సృంజయుడు వారి కాతిథ్యమిచ్చి నమస్కరించెను. ఆరాజున కేదైనను మేలు చేయవలెనని వారి కోరిక. అప్పటికే వారు వచ్చి చాల సంవత్సరము లైనది. స్వర్గమును జూడవలెనను కోరిక హెచ్చెను. ప్రయాణమునకు త్వరపడుచుండిరి.

వారిరువురు సృంజయుని బిలిచిరి. "రాజా, నీ సేవలకు తృప్తి నొందితిమి. వలయు వరములు కోరుకొనుము. ఇచ్చెదము." అని పల్కిరి. అతడు "మీరు ప్రీతులగుటయే పదివేలు. నాకు వేఱువరము లవసరము లేదు." అని వినయముగా బలికెను. అతని వినయమునకు వారు మెచ్చుకొనిరి. "రాజా! దేవతలను మించిన తనయుడు కావలెనని నీవు మనసులో కోరుచుందువు. నీతలంపు మాకు దెలియును. అట్టి పుత్రుడే నీకు కలుగును. నిశ్చింతతో నుండుము." అని వరమిచ్చి అనుగ్రహించిరి.

పర్వతునికి ఇంద్రునిపై ప్రేమ యెక్కువ. వారు రాజున కిచ్చిన వరము పెద్దది. దానివలన సృంజయుని పుత్రుడు

దేవేంద్రునికంటె గొప్పవాడగును. అట్లగుటపర్వతుని కిష్టము లేదు. రాజుతో "అయ్యా! నీ పుత్రుడు తేజోవంతుడై పుట్టును. కాని దీర్ఘాయుష్మంతుడు కాడు." అని పలికెను. ఆ పలుకులకు మానవనాథుడు ఉలికిపడెను. "మహాత్మా! మీకేల యిట్టి బుద్ధిపుట్టినది? మీఅనుగ్రహమునకు కొఱత యేల కల్గినది? మీ దయారసము నాపై పూర్తిగా ప్రసరింపదా? లోటు చేసెదరా? అని దీనముగా ప్రార్థించెను. రాజు ప్రార్థనలకు పర్వతుడు ఔనన లేదు. కాదన లేదు. సమాధాన మీయక మిన్నకుండెను.

నారదునికి రాజుపై కరుణ కలిగెను. అతనివంక జూచి "రాజా! నీవు భయపడవలదు. మాఅనుగ్రహమునకు లోటు రాదు. ఇంద్రునివలన నీసుతునికి ప్రమాదము రాకుండ జూచుకొనుము. ఏమఱక యుండుము. ఓపినంత శ్రద్ధతో గమనించుచుండుము. అంతగా ప్రమాదము కలిగినపుడు నన్ను దలచుకొనుము. ఆ యాపదను పోకార్తును. నీ కుమారుడు దేవేంద్రుని మించినవాడగును. అతని తేజస్సు దివ్యమై వెలుగును. ఉమ్మియు, చెమటయు, మలమూత్రములును బంగారుమయము లగును. వానికి 'సువర్ణష్ఠీవి' యని పేరు పెట్టుము. ప్రమోదముతో నుండుము." అని ఊఱడించి పలికెను. సృంజయుడు నారదుని బోధలు విని కలక దేఱెను. సుఖముగా నుండెను.

పర్వత నారదులు రాజు నొడపఱిచి స్వర్గమున కరిగిరి. సృంజయునికి కొన్నాళ్ళకు పుత్రుడు కలిగెను. ఆ శిశువు

దేహము తళ తళ మని మెఱయుచుండెను. కన్నులు కాంతు లీనుచుండెను. నల్లని కురులు నిగనిగ లాడుచుండెను. మొగము కళ కళ లాడుచుండెను. ఆ శిశువునుండి వచ్చిన మలమూత్రములు, కన్నీరు, చెమట బిందువులు, ఉమ్మియు బంగారు రంగుతో మెఱయుచుండెను. అవి క్రింద బడినపుడు బంగారు కణిక లగుచుండెను. దినదినము బాలుని శరీరము నుండి రాలుచున్న సువర్ణమునకు మేర లేకుండెను. ఆ శిశువు వింత చరిత్రము దేశమంతట ప్రాకిపోయెను. అందఱు నాశ్చర్య పడుచుండిరి. చూచుటకు తీర్థముగా ప్రజలు వచ్చుచుండిరి. సృంజయుని యిల్లు పుణ్యక్షేత్రముగా మాఱిపోయెను.

దొంగలు కొందరు బాలునిపై కన్ను వేచిరి. తఱి వేచిరి. సమయము దొఱకినది. వారి కోరిక నెర వేరినది. వెంటనే బాలునినోట గుడ్డలు గ్రుక్కిరి. చప్పుడు కాకుండ నడచిరి. అడవిలోనికి పోయిరి. శరీరమును కోసిరి. జల్లెడ పట్టిరి. వారికి బంగారము దొఱకలేదు. రక్తము స్రవించినది. కండలు క్రిందపడినవి. ఆ పాపాత్ములు నిరాశ చెందిరి. చేసిన దోషమునకు సిగ్గుపడిరి. బాధతో ఇంటికేగిరి. గుట్టుచప్పుడు కాకుండ నుండిరి.

బాలుని పోకకు రాజు ఖేదమందెను. తన కుమారుని ఇంద్రుడే అపహరించెనని తలచెను. వానికి శోకముతో తెకువ చెడెను. పుత్రుని కొఱకు పనవి పనవి యేడ్చెను. తుదకు నారదుని ధ్యానించెను. అతడు దేవముని కదా! దివ్యబోధవలన సృంజయుని యేడ్పును వినెను. మనోవేగమున

వచ్చెను. రాజున కెన్నో ఉపశమన వాక్యములు చెప్పెను. ఊఱడించెను. దొంగలు చేసినపని యెఱిగించెను. ముచ్చుల మూర్ఖతచే చచ్చిన శిశువును దెత్తునని చెప్పెను. బుడుత డపుడు నరకమున బడియుండెను. ముని వానిని భావమున ధ్యానించెను. ఆతని ప్రభావముచే సువర్ణష్ఠీవి జీవించెను. పరుగెత్తుకొని తండ్రి యింటికి వచ్చెను. వచ్చిన బాలుని నారదుడు మామ కిచ్చెను. రాజు సంతోషముతో నుప్పొంగి పోయెను. నారదుడు బాలుని దీవించెను. "ఇంద్రు డితనిని జంపుటకు వేచియుండెను. జాగరూకుడవై యుండుము. ఆపద యైన నన్ను దలపుము." అని మామతో జెప్పెను. తన దారి నరిగెను.

ఇంద్రుని మనసు కపటమైనది. అతనికి అసూయ మెండు. ఓర్పు శూన్యము. సువర్ణష్ఠీవిని జంపుటకు వాడు ఉపాయములు వెదకుచుండెను. బృహస్పతితో ఆవిషయము చెప్పెను. ఇంద్రుడు చేయు నీచపుపని దేవగురున కిష్టము లేదు. 'బాలుని వలన భయములే'దని ఇంద్రుని అనునయించెను. ఐనను ఇంద్రు డూరకుండలేదు. వానికి వజ్రాయుధ మున్నది. అది దివ్యమైనది. దానికి చైతన్యమున్నది. బుద్ధి యున్నది. దాని నాలోకించెను. "నీవు పులివై సృంజయుని తనయుని చంపు" మని పంపెను. అది ప్రభువు మాటకు అంగీకరించెను. సమయము కొఱకు జూచుచుండెను.

ఒకనాడు సృంజయుడు ఉత్సాహముతో నుండెను. స్త్రీలతో, బాలునితో అరణ్యమునకు బయలుదేఱెను.

గంగానది యొడ్డుననున్న వనములకు జేరెను. అందలి ప్రకృతి సౌందర్యము ఆనందము గొలుపుచుండెను. రాజు ఆయానంద ములో మునిగి తేలుచుండెను. స్త్రీలు చిగురులు, పూలు కోసికొనుచుండిరి. ఉల్లాసముతో నాడుచుండిరి. పక్షుల కూజితములు వినుచుండిరి. వాని గొంతులతో కలిసి పాటలు పాడుచుండిరి. పచ్చిగడ్డి గుబురులను మెచ్చుకొనుచుండిరి. ఎవరి యానందములో వారు మునిగి యుండిరి. బాలుని మరచిరి. సమయము కొఱకు చూచుచున్న వజ్రాయుధ మచటనే యుండెను. వెంటనే బెబ్బులి యయ్యెను. ఏనుగు గున్నవలె మెల్లగా నడచుచున్న బాలునిపై బడి చీల్చెను. ప్రాణములు దీసెను. వెంటనే అంతర్థానమై పోయెను.

దాది క్షణకాలము మాత్రమే ఏమఱుపాటున నుండెను. ఆపొరపాటును వజ్రాయుధ ముపయోగించుకొనెను. దైవగతి విచిత్రము కదా! బాలుని కొఱకు దాది పరుగిడి పోయెను. అతడు మృతుడై యుండెను. తన పొరపాటునకు దాది యెంతో దుఃఖించెను. లాభమేమి? ఆవార్తను వెంటనే రాజునకు రాణులకు తెలియజేసెను. వారందఱు బాలుని చుట్టును మూగిరి. కుమిలి కుమిలి యేడ్చిరి.

సృంజయుడు కొంచె మోపిక తెచ్చుకొనెను. నారదుని మరల ధ్యానించెను. ఆ దేవమునికి విషయమంతయు బోధ పడెను. ఇంద్రుని శాంతింపజేసెను. బాలునియందు పగ వల దని మందలించెను. అతని నొడబఱిచెను. దివినుండి భువికి వచ్చెను. సృంజయు నోదార్చెను. బాలుని బ్రదికించెను.

చిఱునవ్వుతో బాలుడు లేచివచ్చెను. వానిని గని వారందఱు నానందమందిరి. రాజు బాలు నెత్తుకొని ముద్దాడెను. నారదుడు సరసముగా బలుకరించెను. బాలుని దీవించి స్వర్గమున కరిగెను. రాజు నగరి కరిగి బాలునితో రాణులతో సుఖముగా నుండెను. సువర్ణష్ఠీవి పెద్దవాడై తండ్రి యనంతరము రాజ్యమును చక్కగా పాలించెను. అతని పాలనలో ధర్మము నాల్గుపాదములతో నడిచెను. అతని చరిత్రమును నారదుని మహాత్వమును లోకము కొనియాడెను.

మహాత్ముల అనుగ్రహము సాటిలేనిది. దానితో మృత్యువునుకూడ జయింపవచ్చును అని ఇందలి నీతి.

అజంతా ప్రెస్, తెనాలి.